Sujanaranjani Series No. 2.

# DHARATHMAJA PARINAYAM

THE WELL-KNOWN

*Telugu Dwyardhi Prabandham*

BY

K. Mrutyunjaya Kavi

AUTHOR OF

*(Niroshtya Nala Charitram, &c., &c.)*



COCANADA :—PRINTED AT THE SUJANARANJANI PRESS, 1897.

Sujanaranjani Series No. 2.

శ్రీ

# ధరాత్మజాపరిణయము

అను

## తెలుఁగుద్వ్యర్థి ప్రబంధము

---

మృత్యుంజయకవి విరచితము.

---

కాకినాడ.

సుజనరంజనీ ముద్రాక్షరశాల.

1897.

---

# ధరాత్మజాపరిణయము.

## పీఠిక.

ఈ పేరఁబరఁగు నీద్వ్యర్థికావ్యమును క్రొత్తలంకమృత్యుంజయుఁ డనుమహాకవి రచించెను. ఇంతకుమున్న విరచితములైన ద్వ్యర్థిగ్రంథములగు రాఘవపాండవీయ, హరిశ్చంద్రనళోపాఖ్యాన, రావణదమ్మీయములు మొదలగు నామములవలెంగాక యీ కావ్యనామమునందే ద్వ్యర్థమిమిడియుండుట యొకచిత్రము: 'ధర' యనఁగా భూమియుఁ బర్వతముగూడనగుటచే ధరాత్మజయనఁగా సీతయుఁ బార్వతియు ననియర్థద్వయము. ఇందు సీతారాములయొక్కయుఁ బార్వతీపరమేశ్వరులయొక్కయు పరిణయమహోత్సవకథ వర్ణింపఁబడును. ఇట్టిచిత్రముగలనామముచేతనే యొకకథనే తిరుమల బుక్కపట్టణపు వేంకటాచార్యుఁడు ద్వ్యర్థికావ్యముగా రచియించియున్నాఁడు. ఇతఁడిడిన పేరు "అచలాత్మజాపరిణయము" ఈరీతికావ్యములయందుఁ బ్రప్రథమమగు రాఘవపాండవీయశైలి మరియెవ్వానికిలబడకపోయినను మొత్తముమీఁదఁ బ్రతికావ్యమునందొక్కొక్క నవీనగుణములేకపోలేదు. దీనికుదాహరణముగా గౌణవృత్త్యాదిశ్లేషలచేనిండియున్న రాఘవపాండవీయముకంటె నక్కడక్కడనెక్కుడు సంస్కృతపదఘటితంబై, దీర్ఘసమాసభూయిష్ఠంబై, ముద్దులొలుకుపలుకులచే నొప్పెడు హరిశ్చంద్రనళోపాఖ్యానము గొన్నివిషయముల మిన్నయగును. ఈరెండుకావ్యములయందును బ్రతిపద్యమున నేదోయొకచిత్రముగలిగి యథమయొకటిరెండుశ్లేషలైనను నిండియుండకమానవు. కానియీధరాత్మజాపరిణయమునందట్లుగాక యొకటిరెండుపద్దెములయందు మాత్రము పెక్కులగు విరుపులచేఁ జక్కనై వెనువెంబడివచ్చెడు పదిపదునైదుపద్దెములవఱకు శ్లేషయన్నమాటయే లేక రెండుకథలకు సమానార్థములై విలసిల్లుటయుకలదు, ఉన్న చోటమాత్రము శబ్దార్థాది శ్లేషలన్నింటిచే నొప్పియున్నది. ఇయ్యది నాలుఁగాశ్వాసముల గ్రంథము. దీనిశైలి యనవద్యమై, కర్ణరసాయనముగానుండును. దీనియందు నగ పలుకంటె సంస్కృతపదములెక్కుడుగానుండును.

ఇఁక నీకవివంశావళి యెట్లున్న నీతనిగృహనామమును బట్టియోచింపఁగా నీతఁడమలాపురము తాలూకాలోని క్రొత్తలంక వాస్తవ్యుఁడైయుండునని తోఁచెడును. ఈతఁడు శివభక్తుఁడును శివార్చకకుల సంభవుఁడునై యున్నవాఁడు. ఈతనితండ్రిపేరు విశ్వనాథము. గోత్రము భారద్వాజము, సూత్రము బోధాయనము. ఈతఁడు రమారమి నూరునూటపాతికసంవత్సరముల క్రిందటివాఁడని నిర్ణయింపవలసియున్నది. క్రొత్తలంకసమీపమున నున్న మురుమళ్ళయందు శివార్చకుఁడుగా తండ్రిచే నియమింపఁబడిన యీతఁడద్దానిలక్ష్యపెట్టక చిన్ననాట నుండియుఁ దనతోటిదుష్టులగు బాలురతో నాటపాటల

యందుమునిఁగి తేలుచుండెననియు నక్షరజ్ఞానమన్న మాటయేలేక పసులకాపరివలెన ల్లాడునీతనిఁజూచి లోకులందఱు దూషించుచుండిరనియుఁ దరువాతఁగొంత కాలమి ట్లుజరుగఁ బరమశైవభక్తుండగు నితనికొకనాఁడొకయోగిసాక్షాత్కరించి సర్వశాస్త్ర వేత్తఁగాఁజేసెనని చెప్పెదరు. అన్నికథలవలెనిదియు నొకపుక్కిటి పురాణముగాని విశ్వాసనీయముగాదు.

కాని యీకవిచేసిన చిత్రమింకొకటికలదు. అవతారికలయందు ప్రతిగ్రంథమును అల్లూరి అప్పలరాజాదులచే రచియింపఁబడినట్లువ్రాసి వారివంశాభి వర్ణనంగావిం చుచుఁ గృత్యాద్యవస్థయందుఁ దనయూరిపేరును జెప్పక గద్యయందుమాత్రము దనపేరు వెల్లడిచేసికొను కుతూహలము గలవాఁడైయున్నాఁడు. ధనగ్రహణవృత్తిచే స్వరచిత గ్రంథములన్నింటి పరులువిరచించినట్లు వ్రాసితనఖ్యాతి పోగొట్టుకొనకుండ నిట్టులగా వించియుండును. అవతారికయందా క్షత్రియునిగూర్చి యిట్లువ్రాసియున్నాఁడు.

ఉ. ఎల్లజగంబులం గరుణనేలెడు * * * * *
అల్లురివంశసంభవుఁడ నప్పనృపాలక నామధేయుఁడన్.

ఈకవిచేరచితములయిన యితరగ్రంథములెవ్వియన:

| గ్రంథనామము. | ప్రణీతకృతికర్తలు. |
|---|---|
| 1. శ్రీకృష్ణవిజయము (?) | విజయనగర మహారాజాగారికి. |
| 2. మూర్తిత్రయోపాఖ్యానము | ఉప్పాంగల దంతులూరివారికి. |
| 3. షట్చక్రవర్తిచరిత్ర (?) | బిక్కవోలు మల్లారెడ్డికి. |
| 4. ధరాత్మజాపరిణయము | అల్లూరి అప్పలరాజునకు. |
| 5. నిరోష్ఠ్యనలచరిత్ర | బోడిపాకల రాజులకు. |
| 6. బృహన్నారదీయము | |

ప్రణీతకృతులుగాఁ జేయఁబడినవి. ఇట్టివానికనేకటి మహాకవులకుఁగూడఁ జరి గియున్నదిగదా. కవితాపితామహుండగు నల్లసాని పెద్దన తారచించిన యాముక్తమా ల్యదకుఁగృష్ణదేవరాయనిఁ గృతికర్తగాఁజేయలేదా?

ప్రణీతకృతికర్తలే యీగ్రంథములకునిజమైన కృతికర్తలన్నచో నిన్నిపాత్రముల శైలి యు వర్ణనలునొక్కరీతిగా నేలయుండును? వేర్వేరనీగ్రంథము లెప్పుడెప్పుడు రచిం పఁబడినవో మనకుఁదెలియకున్నను పైవృత్తాంతము ననుసరించినచోఁ గవిచరిత్రమందు మల్లారెడ్డికాలమునుబట్టి తత్కాలీనమైన యిదియుదానికి రెండుమూఁడు వత్సరముల కీవలావల నిర్ణయింపవచ్చును. ఇంతకంటెనీకవి యొక్కగాని గ్రంథాదులయొక్కగా ని చరిత్రమాకుఁ దెలియమింజేసి యింతటితోఁ దృప్తినొంది విరమించుచున్నారము.

T. V.

శ్రీ

# ధరాత్మజాపరిణయము.

## ప్రథమాశ్వాసము.

శ్రీకాంతామణిసర్వలోకనికరక్షేమంకరాత్యున్నత
శ్రీకారుణ్యకటాక్షనిత్యముఁదనున్సేవింపఁగాఁగోరియ
స్తోకప్రేమముచేభుజాంతరమునందున్నిల్వఁజెల్వొందులో
కైకాధ్యక్షునిశ్రీహరిందలఁతునిత్యానందరూపాన్వితున్. 1

చ. భువనములెల్లగర్భమునఁబూనుటయెవ్వరుజూచినారుత
త్ప్రవిమలకాంతియెంతయనిప్రాభవమొప్పఁగమీఱుమౌళిపై
భువనములుంచినారదియపూర్వమటంచుభవానిపల్కఁగా
నవదరహాసియౌప్రమథనాథుఁడుమాకుఁబ్రసన్నుఁడయ్యెడిన్. 2

ఉ. మేలగుభక్తియోగమునమీఱినవారికిఁబూరుషార్థముల్
నాలుగునేనయిత్తుమదినమ్ముఁడటంచుసదెల్పువైఖరిన్
నాలుగుమూర్తులైనతననాళివసించుటకేమొమోములన్
నాలుగుఁబూనినట్టినలినప్రభవున్మదిలోభజించెదన్. 3

సీ. తొలుబల్కుగములకైతొలుతఁజూపినవింతఁదెలికన్నుదోయినిచ్చలుధరించి
గిరియెత్తుకొఱకునంగీకరించినలీలఁ బ్రపదసౌందర్యంబుపాలనిలిపి
యుక్కుఁగంబమునందునుదయమందిననాటిసిరిఁగొంతలేఁగొనుచెంతఁబూని
యాదవాన్వయభవుఁడైననాటియభిఖ్య గొప్ప వేనలియందుఁగుదురుపఱిచి
భర్తృసాధర్మ్యవతియైనపంకజాక్షి । యమ్మహాలక్ష్మిసకలలోకైకమాత
హరిపదాశ్రితజనులగేహాంతరముల । నిత్యమునునిశ్చలంబుగానిలుచుగాత. 4

ఉ. హాటకగర్భుఁడాదిగసుధాశనకోటిపదంబులెల్లనే
జోటికటాక్షలేశమునసుస్థిరరీతివహించుచుండున
ప్పాటలగంధిశంకరునిపట్టపురాణికృపాసమగ్రత
న్నాటికిసర్వకార్యములమాకుసహాయతఁజేయుఁగావుతన్. 5

చ. శ్రుతులతెలుంగుశాస్త్రములచొప్పుపురాణగణంబురీతియం
చితరసయుక్తిమత్కృతివిశేషముభాకృతియున్వహించియే
నతివిహరించులోకములసర్వజగన్మయిమైనయాసర
స్వతినిరతంబుమామకరసజ్ఞపయిన్విహరించుఁగావుతన్. 6

ఉ. శైలజమ్రోలఁదాండవమునల్పుతలిన్ గిరులెల్లఁగర్ణవా
తూలవశంబుచేమిపులఁదూలుచునంచరణంబొనర్పఁగా
లాలితకండుకావళివిలాసముఁజూపెదఁజూడుమంచున
బ్బాలమృగాయతాక్షిఁగనిపల్కుగణాధిపతిన్ భజించెదన్. 7

సీ. అఖిలశిష్యశ్రేణియజ్ఞానతిమిరంబు నణఁగించువేళబాలాతపంబు
ఆశ్రయించినవారి కభిమతార్థములెల్లఁ గలుగంగఁజేయుచోఁ గల్పవల్లి
శరణాగతులకువైష్ణవరహస్యనిధిఁబ్ర త్యక్షంబొనర్పసిద్ధాంజనంబు
తనవారలకుఁబరతత్త్వమార్గముఁజూపఁ గమనీయకరదీపికాప్రకాశ
మగుచువిలసిల్లుచుండునేయనఘమతికృ । పావలోకంబులోకంబులభినుతింప
నతనిఁదిరుమలవంశదుగ్ధాబ్ధిపూర్ణ । చంద్రుఁడైనట్టివేంకటాచార్యుదలఁతు. 8

గీ. ఆదికవియైనవాల్మీకినభినుతించి । వ్యాసమౌనీంద్రుసత్కృపావార్ధిఁదేలి
కాళిదాసునకునుమ్రొక్కు గేలుసేసి । మాఘభారవిముఖమహామహులఁబొగడి. 9

ఉ. నన్నయభట్టునెన్నిబుధనందితకీర్తిఁదిక్కయజ్వకున్
సన్నుతిఁజేసిభీమకవిచంద్రునకంజలిఁగూర్చిభాస్కర
య్యన్నుతియించిసోముఁగొనియాడికవిత్వమహత్త్వవైఖరి
న్నన్నఁబ్రసిద్ధిఁగన్నశుభమూర్తులనెల్లఁబ్రశంసనేయుదున్. 10

గీ. రసములూరుకావ్యరచనలచేన్నృపా । గ్రణులసభలఁగీర్తిఁగన్నవారి
వర్తమానకవులవర్ణనఁగావించి । గారవమునవారికరుణఁగాంచి. 11

గీ. ఊరికోమటులుమహోజ్వలమగురత్న । మరసిగాజుపూసయన్నకరణి
నొప్పుఁదప్పటంచునూహింపకుండఁగఁ గుకవులకుఁబ్రియోక్తిఁగొంతగూర్చి. 12

వ. అనినిఖిలజగత్ప్రధానదేవతాగురు నమస్కారంబు పురాతననూతన సుకవిపుర
స్కారంబు కుకవితిరస్కారంబును గావించి. 13

ఉ. ఎల్లజగంబులుంగరుణనేలుమహాత్ముఁడనిందిరామనో
వల్లభునాశ్రయించినిరవద్యతదీయకృపావిభూతిభూ
వల్లభసత్సభావిబుధవర్గ్యకవిత్వనిరూఢిఁగన్నశ్రీ
యల్లురివంశసంభవుఁడనప్పనృపాలకనామధేయుఁడన్. 14

వ. ఏనెద్దియేనియుఁజమత్కార భవ్యంబగు కావ్యంబురచియింపం గుతూహలంబుఁ
గాంచియొక్కనాఁడు. 15

గీ. శాస్త్రవాదులువేదులుసరసకవులు । చెలులుబాంధవులాదిగాఁగలుగునట్టి
సభ్యజనులుసన్మాననసహితులగుచుఁ । జెంతవసియింపవారితోఁసంతసమున 16

గీ. అవసరార్థంబులైనయాయాయికథలఁ । బ్రొద్దుఁగడపుచునున్నయాబుధకవీంద్ర
సంఘములలోననొక్కప్రస్తావమైనఁ । బలికిరీరీతిసరసవాక్పాటవమున. 17

ఉ. భూమినిరాజవంశమునఁబుట్టిజనుండువివేకతత్పరుం
డైమహనీయకీర్తిసుకృతార్జనయత్నముసేయఁగల్గినన్
భూమిపతీ! యతండొకఁడుపూరుషరత్నము గాకయున్నచో
నేమిఫలంబువాఁడుజనియించుటకున్వివరింపఁగాఁదగున్. 18

గీ. ఎంతకాలంబుతనకీర్తియిలఁజరించు । నంతకాలంబుస్వర్గలోకాధివాసి
యగుచువిలసిల్లుసజ్జనుండన్నపుణ్య । కథపురాణంబులందువిఖ్యాతమయ్యె. 19

గీ. అట్టికీర్తియుసుకృతంబునందుకొఱకు । నేరుపులుచాలఁగల్గునన్నింటిలోన
నార్యజనములువర్ణింపనాయునొకటి। సంతతులుధాత్రియందుఁబ్రశంసఁగాంచు. 20

గీ. తనయవనతటాకధరణిసురోద్వాహ । భవ్యదేవభవనకావ్యనిధులు
సప్తసంతతులనజగతినినుతిఁగాంచుఁ । జారుకీర్తిసుకృతకారణములు. 21

క. ఆసర్వసంతతులక । గ్రేసరమైవెలయుచుండుఁగృతితత్సుకృతం
బాసేతుశీతనగవసు । ధాసకలాస్థానవిఖ్యాతిదక్షంబగుటన్. 22

ఉ. కావునభూవరేంద్ర! యొకకావ్యముభవ్యగుణాన్వితంబుగా
నీవొనరింపునింపుమతినిర్మలకీర్తిదిగంతరంబులం
దావకవంశ్యులైనవసుధావరులెల్లనగణ్యపుణ్యసం
భావనఁబావనాత్ములయిప్రస్తుతిఁగాంతురుముజ్జగంబులన్. 23

గీ. ఓనృపాలక ! నీవయర్హుండవిట్టి । శాశ్వతఖ్యాతిసుకృతముల్సంగ్రహించి
వంశజులనెల్లనధికపావనులఁజేయఁ । బ్రణుతిఁగావింపఁదగియెనీభాగ్యమహిమ. 24

సీ. శ్రీహరినామవిశేషసంకీర్తనాపరతచేనీజిహ్వపావనంబు
భూసురాశ్రితదీనపోషణకారుణ్యనిరతినీహృదయంబునిష్కళంక
మనిశపాత్రప్రదానారంభకలనచేనీకరంబురుయశశ్శ్రీకరంబు
కమనీయసత్కథాకర్ణనాసక్తినీవీనులుసాఫల్యవిలసితములు
పూర్వరాజర్షిచరితమబ్బురముగాఁగ । నభ్యసించితివీవుభాగ్యంబుకతన
నౌరయల్లూరియక్కధరాధినాథ । తనయ ! యప్పనృపాల ! సద్ధర్మలీల. 25

గీ. నీకుమారుండురూపలక్ష్మీకుమారుఁ । డాకుమారుఁడవార్యశౌర్యంబుచేత
బాలచంద్రునిక్రియజనప్రమదకార । ణాభ్యుదయశాలియైమీఱునయ్యవారు. 26

ఉ. అంబుధియందనర్ఘమణులన్నియుఁగూర్చినకౌశలంబుచి
త్తంబుననుంచిదక్షుఁడయితామరసప్రభవుండుసర్వలో
కంబులఁగల్గుసద్గుణనికాయములన్నియుఁదెచ్చికూర్చిని
త్యంబుగనయ్యభూమిపతియందుఘటించెఁబ్రమోదమానుఁడై. 27

ఉ. అన్నిటనీవుభాగ్యనిధివౌటనిజంబు నృపాలచంద్రయ
భ్యున్నత కీర్తివైభవముఁబొందెదగుం గృతికర్తవైనము
ద్యన్నిగమాంతపారసముదారరహస్య వివేకవద్విప
శ్చిన్నికరానుమేయుఁడగు శ్రీహరిమీకు సహాయుఁడయ్యెడున్. 28

గీ. అనినసభ్యులయాశయంబస్మదీయ । హృదయవాంఛానురూపమైమొదవెననుచుఁ
గావ్యనిర్మాణకుతుకంబుఁగన్ననాకు । నుల్లమునసుల్లసితమయ్యెనొక్కయూహ. 29

చ. హరికథలందుఁ గొందఱికినాదరమెక్కువ యిందిరామనో
హరుకథలందుఁ గొందఱికినత్యనురాగము రెంటియందునుం
బరగుచునుండుఁ గొందఱికిభక్తిసమున్నతి యట్లుగాననం
దఱు నలరింతుమత్కృతికథాద్వయకల్పన కౌశలంబునన్. 30

క. ఒకయర్థముగలకావ్యము । సకల కవీంద్రులకు నెల్లసాధారణమా
నకలంకార్థద్వయకృతిఁ । బ్రకటించి బుధాళికబ్బురము ఘటియింతున్. 31

ఉ. సాహసమిత్తెఱంగుననసాధ్యమహత్కృతిఁ బూనుటంచునే
నూహయొనర్చి యాశ్రితజనోదిత పూర్ణదయావిలాసుఁడౌ
శ్రీహరి ప్రాపుగల్గునని చిత్తములోపల నిశ్చయించియు
త్సాహముఁగంటి నర్థయుగసంయుత కావ్యవిశేష సృష్టికిన్. 32

వ. ఇత్తెఱంగునం గృతోత్సాహుండనై గౌరీసీతాకల్యాణ కథాద్వయ శ్లేషవిశేష క
మనీయంబగు ధరాత్మజా పరిణయ నామకంబైన ప్రబంధంబు సేయుటకు నంతఃకర
ణంబున సిద్ధాంతీకరించి యేతత్కృతిహారవల్లికి నాయకరత్నంబే గుణ రత్నాకరుం
డు దొరకునోయని యూహించుసమయంబున. 33

సీ. బాలభాస్కరరోచిమేలుమెచ్చనికెంపు డాలు గ్రమ్మెడు కిరీటంబుతోడఁ
గర్ణకుండల హీరకాంతిసంతతులతోఁ గలహించుచిరునవ్వుమొలకతోడ
సిరియుమేల్పదకంబుసిరియునిచ్చలుగూడి మెలఁగుపట్టగునురస్స్థలముతోడ
శంఖచక్రగదాదిచారు చిహ్నములతోఁ దనరారు నాల్గు హస్తములతోడ

మదనశతకోటిసౌందర్యమహిమతోడఁ । గరుణ వెదజల్లుశుభకటాక్షములతోడ
నాశ్రితాభీష్టఘటనాసమర్థుఁడైన । హరిగనఁగనయ్యె మన్మనోభ్యంతరమున. 34

వ. అక్కరణిం గరుణాసముద్రుండైన యమ్మహానుభావుండు నిశ్చలధ్యాన గోచరుం డైన నేనుంబులకాంకురాలంకృత సకలశరీరుండనై యంజలి ఘటియించి యిట్లని స్తుతియించితి. 35

సీ. జయపుణ్యచారిత్రసారసదళనేత్ర హరినీలనిభగాత్రయసురజైత్ర
జయభక్తమందారసత్యచిదాకార కౌస్తుభాలంకారకలుషదూర
జయయశోదాబాలసర్వజగత్పాల సామగానవిలోలసర్గమూల
జయసంతతానందసన్నుత సురబృంద యచ్యుత గోవిందయజముకుంద
జయయనంతగుణాటోపశార్ఙ్గచాప । విమలనిజనామహృతపాపవిశ్వరూప
జయమనోహర హాసలసద్వికాస । గురుతర దయావిలాస వైకుంఠవాస. 36

సీ. వ్రేపల్లెలోఁబాలువెదకి త్రావెడువేళ దావపావకకీలఁద్రావువేళ
మురువుఁజూపుచుఁ దల్లిమ్రోలనాడెడువేళ నహిరాజుతలలపైనాడువేళ
బాలకేలికఁబందుబంతియొత్తెడువేళ నెలమి గోవర్ధనంబెత్తువేళ
వైకుంఠ పురసౌధవాసివయ్యెడువేళఁ బసులఁగాపరియింటమసలువేళ
నొక్కరుచియొక్కయుత్సాహమొక్కబలిమి । యొక్కసుఖవృత్తియునుగల్గియుల్లసిల్లు
నీపరమతత్త్వమెట్టిదిఁగివర్ణింపఁగలరె । యంబుజభవాదిసురలైనహరిముకుంద. 37

సీ. సురనదీపూరభాసురమరుత్కోటీర విసరహీరప్రభావినిమయంబు
నఖచంద్రబలిశిఖానల్పకల్ప ప్రసూనాళిధాళం ధళీమేళనంబు
మంజీర మరకతకంజాత సంజాత శయకుశాంకూర రుక్సంకరంబు
సహజనీలిమవార్ధిసంభవాచికురసం బంధబంధుర కాంతిబాంధవంబు
గలిగివిలసిల్లు మీపాదకమలయుగము । మదిఁదలంతుభజింతువేమరునుతింతు
ధీరమానీంద్రబృందచేతోరవింద । చరణ చతురమిళింద శ్రీహరిముకుంద. 38

సీ. నీసుదర్శనమట్లనీసుదర్శనమును బహుపుణ్యజనమోక్షఫలకరంబు
నీమహోదరమట్లనీమహోదరమును నాపూరితాఖిలాశాంతరంబు
నీపదోన్నతియట్లనీపదోన్నతియునా తతజగన్నాశనసాద్భుతరసంబు
నీవివాహంబట్లనీవివాహంబును నిహితామృతావాసనేత్రమోద
మహాహా భవదీయ చరితంబులభినుతింప । వశమె బ్రహ్మాది దేవతావరులకైన
భువనపాలన సంకల్పభోగితల్ప । యాశ్రితానంత పుణ్య శ్రీహరిశరణ్య. 39

సీ. అదిచంద్రబింబమోయలఘువజ్రోపల జ్వలితకోటీరమో తెలియరయ్య

యదిభానుమూర్తియొయంచితోరస్స్థలీ దివ్యరత్నమొవిభేదింపరయ్య
యవితారకంబులో యతిసుందరాకార హారమౌక్తికములో యరయరయ్య
యవికులాచలములో యసురబాణాఘాతకిణచిహ్నములొ వివేకింపరయ్య
యనుచునద్భుతమంది బ్రహ్మాదిసురలు । సారెసారెకుఁ బందెముల్పఱచుకొనుచు
బెదరిబెదరి నిరీక్షింపఁ బెరుగుచున్న । నీ త్రివిక్రమలీల వర్ణింతు దేవ. 40

సీ. మధుకైటభప్రాణమారుతోల్లసనంబు లుడుపుచో నీవాకరుఁడవు కావె
దితిపట్టిఁ జలపట్టి తెగటార్చి జయలక్ష్మిఁ బొందుచో నద్వితీయుఁడవు కావె
దైత్యునిమర్దించి ధరఁ జక్కనెత్తుచో నుర్వితేతరసహాయుఁడవు కావె
ఖరదూషణాదిరాక్షసులఁ గీటడఁగించి నుతిఁ గాంచుచో ననన్యుఁడవు కావె
యట్టి నీ వింద్రసుతునకు నాహవమునఁ । దేరుగడపుచుఁ దోడయి కౌరవేంద్ర
బలముఁ ద్రుంచుట యాశ్రితపక్షపాత । మహిమఁ బ్రకటించుటకుఁ గాదె మదనజనక. 41

సీ. సాష్టాంగవినతియుద్యత్ప్రభావిజితరాక్షసచక్రమైన మీ చక్రమునకు
శరణు భీషణమహాస్వనమూర్ఛితారాతిసైన్యమౌ మీ పాంచజన్యమునకు
దండంబు ఖండితాఖండలవైరిప్రకాండమౌ మీ గదాదండమునకు
మోడ్పుఁగేలు సురారిముఖ్యదురాలోకరూపమౌ మీ శార్ఙ్గచాపమునకు
వందనము సర్వగీర్వాణబృందహృదయ । నందకంబైన మీ మహానందకమున
కమితభక్తి పరాధీనయనుపమాన । యాశ్రితనిధాన నారాయణాభిధాన. 42

చ. అనియనివార్యభక్తివినయంబులతో జగదేకనాథుని
న్వినుతి యొనర్చి యాఘనునవీనములైన ప్రసాదచిహ్నముల్
గనుగొని చిత్తమెంతయు వికాసముఁ బొందమదీయకావ్యమా
యనఘునకున్ రమాపతికి నర్పణ సేయఁగనూహ సేయుచున్. 43

గీ. కవులు మెచ్చఁగ ధాశ్లేషకలితమై ప్ర । కాశము వహించు నిమ్మహాకావ్యమునకు
హరిజగద్భర్త భర్తయైయలరెనేని । కనకమునకు సుగంధంబు గలిగినట్లు. 44

వ. అని సంతసించి సకలదేవతాసార్వభౌముఁడైన శ్రీహరి పేర నీ కావ్యం బంకితంబు సేయువాఁడనై తదాదియందు మదీయవంశం బభివర్ణించెద. 45

క. చతురాస్యునకున్ మానస । సుతుఁడగుచు మరీచి గల్గె శ్రుతిపారగుఁడౌ
నతనికిఁ గశ్యపుఁడనియెడు । నతితేజోవిభవశాలి యాత్మజుఁడయ్యెన్. 46

క. అతనికి రవియవ్వాసర । పతికి వైవస్వతుఁడు ప్రకటితవిభవో
న్నతుఁడాయన కిక్ష్వాకుఁడు । సుతుఁ డుద్భవమందె నిఖిలసుజనస్తుతుఁడై. 47

క. ఆయిక్ష్వాకునికులమున । శ్రేయోవిభవాఢ్యులై హరిశ్చంద్రాదుల్

న్యాయమున ధాత్రియేలిమ । హాయతసితకీర్తిఁ గాంచిరవ్వంశమునన్. 48

ఉ. మాధవవర్మనాఁగనొకమానవభర్త జనించివిస్ఫుర
ద్బోధనమగ్రుఁడై కనకదుర్గను శ్రీజయవాటికాపురీ
సాధవిహారిణింగొలిచి చక్కఁగఁదత్కరుణావశంబుచే
నీధరహేమవృష్టిఁ గురియించెనతిస్థిరకీర్తి మీఱఁగన్. 49

క. ఆరాజువంశమునసమ । దారిన్నృపాలకవిదారిహరిభక్తిసుధా
నీరధివిహారి శ్రీయ । ల్లారికులజమల్ల శౌరియుదయమునొందెన్. 50

క. ఆమల్లినాథశిఖామణి । వేమాంబావనితయందువిజయోపమశౌ
ర్యామితకీర్తి విహారున్ । భామామన్మథునిఁగనియె బసవనృపాలున్. 51

శా. ఆరాజేంద్రుఁడు సూరమారమణియందర్థార్థిమందారుని
న్మారాకారుని వేమభూవరునిదిమ్మక్ష్మాపతిన్వల్లగం
భీరున్ శ్రీపినతిమ్మశౌరిఁగనిదిగ్బింబాధరామేఖలా
హీరాకారయశోవిలాసములచే హెచ్చెన్ ధరిత్రీస్థలిన్. 52

గీ. వారిలోపలవల్లభూవల్లభుండు । వారితభుజప్రతాపనివారితారి
ధారుణీనాథవినుతపాదారవిందుఁ । డగుచుఁగీర్తి వహించెనీజగతియందు. 53

ఉ. హల్లకమిత్రుఁ గేరుశరదంబుదసంతతులన్హసించును
త్ఫుల్లసితారవిందములపొంకొనరించువిరించికామినీ
సల్లలితాంగదీధితుల జక్కఁదనంబుజయించునెప్పుడు
న్వల్లనృపాలుకీర్తి జనవల్లభసర్వసభాంతరంబులన్. 54

సీ. ఆవల్లధరణికాంతావల్లభుఁడుగాంచె ధీశాలియబ్బమదేవులందు
రసికుఁడౌపెదబాపిరాజువేమనృపాలు సన్నుతారాతియేకన్నృపతి
జనలోకమాన్యుఁడౌపినబాపిరాజును భానుసన్నిభతేజుబసవరాజు
విశ్రుతశ్రీనిధివిస్సధాత్రీనాథు రాజవర్ణితుఁడైనరాయనృపుని
వీరలనివార్యఘనధైర్యవిలసనముల । సప్తకులపర్వతంబులసాటిఁగాంచి
దానగాంభీర్యగుణలఁదలఁచిచూడ । సప్తవారాసులనఁగఁ బ్రశస్తిఁగనిరి. 55

ఉ. వారలలోపలన్విమతవారలఘూకరణైకదక్షదు
ర్వారబలాఢ్యుఁడైనబసవక్షితినాథుఁడుమీఱెవార్ధిగం
భీరుఁడనన్ రణాంగణవిభీతనృపాలకజాతరక్షణో
దారుఁడనన్సమస్తజనతావినుతప్రథమానకీర్తియై. 56

క. రసికశిఖామణియగునా । బసవక్షోణీశ్వరుండుపరిణయమయ్యెన్

వసుధావర్ణితవిస్ఫుర । దనమానగుణాఢ్యుఁడైనయక్కపదేవిన్. 57

ఉ. నిక్కపుధర్మమార్గమున నీతియునిశ్చలదానలీలఁ బెం
పెక్కినసాధువృత్తి యుసజేశ్వరపాదపయోరుహంబులే
చక్కనిభక్తిఁ గొల్చువిలసన్మతియున్ భువనంబులందు శ్రీ
యక్కపదేవియందనతమయ్యెబుధుల్వివరించిచూడఁగన్. 58

చ. అనుపమతేజుఁడా నృపతియక్కమదేవులయందుఁ గాంచె నం
దనులగుణాఢ్యునప్పనరనాథునివల్లనృపాలు వెంకటా
వనిపతిఁ గృష్ణనామజనవల్లభునబ్బనరేంద్రు బాపభూ
జనపతినీతిశాలినరసప్రభులింగనృపాలశేఖరున్. 59

ఉ. వారలలోన నగ్రజుఁడవారితభూరిభుజప్రతాపల
క్ష్మీరమణీయభాస్కరరుచిప్రచయాపహృతోగ్రవైరిదు
ర్వారమదాంధకారుఁడుధరాధరరాజసమానధైర్యవి
స్తారుఁడు మీఱునప్పవసుధాపతిచంద్రుఁడు కీర్తిసాంద్రుఁడై. 60

సీ. తనడెందమిందిరాధవుచరణారవిం దంబులపైమిళిందములుగాఁగ
దనదయాదృష్టియుత్తమబుధాశ్రితబంధు విసరంబుపైసుధావృష్టిగాఁగ
దనకోపలీలయెంతయువైరికాంతార జాలంబునకుదవజ్వాలగాఁగ
దనశుభకీర్తిదిక్తరుణీముఖాంబుజం బులచెంతదర్పణస్ఫూర్తిగాఁగ
నలరునేరాజుకవిరాజులభినుతింప । భోగయుతభాగ్యవైభవాభోగలీల
నతఁడువిలసిల్లుబసవభూపతికుమార । రత్నమైనట్టియప్పధరావరుండు. 61

సీ. తనవయోలీలవృద్ధతఁ జూపుటయెకాక యతిసద్గుణములచేనట్లుసూపెఁ
గదనరంగమునజంకకనిల్చుటయెకాక యర్థులకిచ్చుచోనట్లనిలిచెఁ
గవిజనాశ్రితకోటిఁ గరుణఁ జూచుటెకాక యానతారిగణంబునట్లుసూచె
నహితభూపతులయందలుకఁ గాంచుటెకాక యన్యాయతరులయందట్లకాంచె
నతఁడతిపరాక్రమక్రియోన్నతుఁడుకీర్తి । యుతుఁడుకారుణ్యరక్షితాశ్రితుఁడు విబుధ
నుతుఁడురాజన్యమాత్రుఁడె క్షితితలమున । బసవజననాథునప్పనృపాలమౌళి. 62

గీ. ఆమహోదారచర్యుఁడా యప్పనృపతి । వరుఁడునిజధర్మసరణిను ద్వాహమయ్యె
జనవరస్తుత్యశాంతివర్తనముచేత । భూవనితసాటిమాదమాంబావధూటి. 63

సీ. అనృతవాక్యంబునునప్రియవాక్యంబు జిహ్వపైనెన్నఁడుఁ జేరకుండ
వనజాక్షుచరణభావనకన్ననన్యమౌ చింతచిత్తములోనఁ జెందకుండఁ
బతియాజ్ఞయిందిరాపతియాజ్ఞగాఁ జూచు ధర్మమావంతైనఁ దప్పకుండ

సుస్థిరంబగుకీర్తిసుకృతంబులనుమహాధనములపై నాశదఱుగకుండ
నుభయకులపావనియనంగనుర్విలోన । వన్నెఁగాంచెను సౌశీల్యవర్తనమున
భూరికరుణాసుధావర్షపుషితనిఖిల । భూదివిజరాట్కదంబశ్రీమాదమాంబ. 64

గీ. అప్పభూజానియామాదమాంబయందు । సుతులసౌజన్యసుగుణవిశ్రుతులఁగాంచె
బసవనృపమౌళియక్కభూపతియుబాప । జనవరుఁడు పేరవిభుఁడు నాఁదనరువారి 65

వ. అందగ్రజుండు. 66

చ. బసవనృపాలమౌళితగుఁబంకజనేత్రపదాబ్జభావనా
రసికమనోరవిందుఁడువిరాజితరాజముఖీవిమోహన
ప్రసవశరాసనుండహితపార్థివగర్వవిభంజనక్రియా
విస్ఫుమరబాహుశౌర్యుఁడతివిస్ఫుటకీర్తివిలాసధన్యుఁడై. 67

సీ. అహితాన్యవాదిజిహ్వాంచలస్తంభనమంత్రమేరాజేంద్రుమాటనేర్పు
భాసురరాజ్యలక్ష్మీసమాకర్షణమంత్రమేవిభునీతిమంజిమంబు
వైరిదుర్వారగర్వక్రియోచ్చాటనమంత్రమేవిభువిక్రమక్రమంబు
కీర్తనీయానంతకీర్తికాంతావశ్యమంత్రమేవిభునిసమ్యగ్వితీర్ణి
యతఁడువివిధాగమజ్ఞానచతురుఁడేమొ । యనిజనులుమెచ్చనధికవిఖ్యాతిఁగాంచె
ధన్యుఁడల్లూరియప్పభూధవవరేణ్య । తనయుఁడైనట్టిబసవభూధవవరుండు 68

క. ఆమహినాథశిఖామణి । భామాజనమన్మథుండుపరిణయమయ్యెన్
ధీమతియబ్బమదేవులు । రామాంబయుననఁగవెలయురమణీమణులన్. 69

క. పావనియతివిలసితరూ । పావనినిభశాంతిసద్గుణాన్వితయగుచున్
భూవలయంబుననబ్బమ । దేవులుకడువన్నెఁగాంచెధీయుతులెన్నన్ 70

గీ. అతనిరెండవభార్యధర్మైకచర్య । యార్యవర్ణితనిశ్చయౌదార్యధుర్య
హరిచరణధామనిజమానసాబ్జసీమ । యనగసుగుణాభిరామరామాంబవెలయు. 71

సీ. పావనంబయ్యెనేభామినీమణిజిహ్వావర్ణితంబగుసత్యవాక్యముననె
విలసితంబయ్యెనేవెలఁదిమానససీమధవునిపాదాంబుజధ్యానముననె
భాసురంబయ్యెనేపడఁతిహస్తంబునంతతవాంఛితాన్నప్రదానముననె
సంస్తుత్యమయ్యెనేసతిచరిత్రముగురుపాదసంసేవనామోదముననె
యప్పరమసాధ్వివిలసిల్లునల్లురికుల । కలశవారాశిసంపూర్ణకైరవాప్తుఁ
డైనబసవక్ష్మానాయకాగ్రగణ్యు । నంగనారత్నమైనరామాంబజగతి. 72

క. ధీరుఁడగుబసవభూపతి । యారామారమణియందునాత్మజుఁగాంచెన్
ఘోరరణాగతశాత్రవ । వీరసరోజాతసోమువేంకటరామున్. 73

మ. జలజాక్షున్జగదేకనాథుఁగమలాసంవాసబాహాంతర
స్థలుసర్వాశ్రితలోకవత్సలుహరిన్సద్భక్తిసేవించుచున్
లలితశ్రీలఁదనర్చిసద్గుణగణాలంకారుఁడైధీరుఁడై
వెలయున్వేంకటరాముఁడుగ్రసమరోర్వీవిక్రమోద్దాముఁడై. 74

క అనఘుఁడగుబసవభూపతి । యనుజుండుసమీరసుతునియనుజుండనిలో.
ననిలోకులెన్నఁగామ । జ్జనకుండైనట్టియక్కజనపతివెలయున్. 75

సీ. శరణాగతుండైనశత్రుకంఠమునందునసిధారయెన్నడుహత్తనీఁడు
విభుదేవపదారవిందలగ్నంబైనమానసంబెన్నడుమఱలనీఁడు
సత్యపావనమూరసజ్ఞాంచలమునందునాస్తిసంభాషణంబాననీఁడు
సత్కథాదరములౌశ్రవణాంతరములందుసూచకవాక్యముల్సోకనీఁడు
విమలచారిత్రుఁడిద్ధరారమణుఁడనుచుఁ । గవులువర్ణించుచుందురుత్కంఠమీఱ
ధాత్రినల్లూరియప్పభూధవవతంస । నందనుండైనయక్కభూనాథమణిని. 76

క. ఘనుఁడైనయక్కధాత్రీ । జననాథాగ్రేసరుండుసద్గుణములచే
జననుతయగురామాంబా । వనితారత్నంబుఁదగవివాహంబయ్యెన్. 77

సీ. తనచిత్తమునకునిత్యంబైననిలయంబుధవునిపాదాంబుజద్వయమెకాఁగఁ
దనవాక్యమునకుసంతతమైనధర్మంబుసత్యవ్రతైకనిశ్చలతగాఁగఁ
దనకరంబులకునుత్తమమైనకర్తవ్యముచితదానోద్యోగయుక్తిగాఁగఁ
దనవీనులకుఁబ్రశంసంబైనగ్రాహ్యంబువితతమూహరికథామృతముకాఁగఁ
దనకువాంఛింపఁదగినయత్నంబుదీన । సజ్జనాశ్రితలోకరక్షణమెకాఁగఁ
బుణ్యమతియన్నదాననైపుణ్యవతిమ । దంబసుగుణకదంబరామాంబవెలయు. 78

శా. ఆయక్కక్షితినాథశేఖరుఁడురామాంబాసమాఖ్యాకయా
జాయారత్నమునందుఁగాంచెసుతులన్సంగ్రామభీమాహితా
జేయుంబెద్దనృపాలశేఖరునిలక్ష్మీకాంతకారుణ్యలీ
లాయత్తప్రతిభాసమగ్రునమ్రశ్రీయప్పక్షమానాయకున్. 79

ఉ. అగ్రజభక్తిశీలుఁడుసభాగ్రజనస్తుతనీతిశాలినా
యగ్రజుఁడైనపెద్దమనుజాధిపచంద్రుఁడుకీర్తిఁగాంచు న
త్యుగ్రకరాసిభాసురవిధుంతుదకల్పితదుష్టవైరి రా
జగ్రసనుండుదగ్రతుహినాచలరాజసమానధైర్యుఁడై. 79

సీ. ధనదుఁడౌఁగానిసంతతముకిన్నరులతోమైత్రిగావింపఁడుమఱచియైన
జిష్ణుఁడౌఁగానివర్ధిష్ణుశౌర్యమునసపక్షభూభృద్వేషపరుఁడుగాఁడు

ఱాజవుఁగానిమిత్రసమాగమంబునఁదనకళాసామగ్రిఁదఱలనీఁడు
ఘనుఁడవుఁగానిసంగతచపలాత్మస్వభావుఁడై నెఱపఁడుప్రౌఢిమంబు
నతఁడు రాజన్యమాత్రుఁడే క్షితితలమున।ననఁగసద్గుణరీతివిఖ్యాతిఁగాంచె
నౌరయల్లూరియక్కధరాధినాథు । తనయుఁడైనట్టి పెద్దభూధవవరుండు. 80

సీ. శ్రీసమగ్రతచేబుధశ్రేణివాఁగడఁ బ్రస్తుతివహించు పెద్దభూపాలశౌరి
సుగుణరత్నాకరోదయశోభమాన । వర్ణ్యశుభలక్ష్మిలక్ష్మినుద్వాహమయ్యె. 81

గీ. స్వామిపరిచర్యసద్వ్రతచర్యగాఁగ । సంతతవదాన్యగుణముభూషణముగాఁగ
ధర్మవృత్తంబెయాత్మవృత్తంబుగాఁగ । లక్ష్మివిలసిల్లుసద్గుణలక్ష్మియగుచు. 82

క. ధీరోత్తముఁడా పెద్ద । క్ష్మారమణుఁడులక్ష్మియందుఁగాంచెఁదనయుల
న్మారాగ్రేసరుబాపధ । రారమణుని వెంకటపతి రాజవరేణ్యున్. 83

క. ఆయక్కక్షోణీతల । నాయకుననుజన్ముఁడగుచునరలోకసభా
గేయుఁడువితరణగుణరా । ధేయుఁడు బాపక్షితీశతిలకంబలరున్. 84

గీ. ధైర్యగుణముచేతధారుణీధరరాజు । భూరివాగ్విలాసభుజగరాజు
వర్ణనీయమగువితీర్ణిచేశిబిరాజు । భాగ్యదివిజరాజుబాపిరాజు. 85

క. ఆనృపలోకశిఖామణి । మానవతీరత్నమలరుమహనీయగుణ
శ్రీనిరుపమసూనృతవా । చానైపుణిగుర్వమాంబసజ్జనులెన్నన్. 86

క. బాపనృపాలునియనుజుఁడు । భూపాలసభాగ్రసుజనపూజ్యుఁడుధర్మ
వ్యాపారైకధురీణుం । డా పేరనృపాలవర్యుఁడలరున్ధాత్రిన్. 87

ఉ. ధారుణిలోనరాట్సభలధన్యుఁడితండనిసత్కవీశ్వరు
ల్సారెకుఁబ్రస్తుతుల్సలుపశౌరిపదాంబుజభక్తియుక్తిన
ల్లూరికులాభిధానకలశోదధికింబరిపూర్ణచంద్రుఁడై
పేరమహీధవుండలరుఁబృథ్విని శాశ్వతకీర్తిమీఱఁగన్. 88

క. పేరనృపాలవరేణ్యుని । చారుయశోమహిమవెలయుశారదవేళా
నీరదనారదహిమక । ర్పూరపటీరోపమానభూరిద్యుతులన్. 89

గీ. ఆనృపాలునికాంతధర్మైకవసతి । యనిశపతిపాదయుగభక్తికాశ్రయంబు
శాంతికినిమందిరంబునైజగతిలోన।విపులతరకీర్తివహియించె వెంకటాంబ. 90

గీ. నీతిశాలిపేరనృపమౌళి వెంకటాం । బాఖ్యయైనవనితయందుఁగాంచె
వెంకటాద్రియప్పవిభుఁడుమాధవుఁడును । బసవరాజుననఁగభాగ్యయుతుల. 91

ఉ. ఈవిలసద్గుణోన్నతివహించినమామకవంశజాతధా
త్రీవరరాజికెల్లఁగులదేవతశ్రీహరివిశ్వమూర్తినా

నావిధలోకరక్షకుఁడె నాకుసహాయత సేయునంచు నే
భావములోన నెంచిముని భావ్యునకాజగదేకకర్తకున్. 92

క. శ్రీరమణీకుచయుగళ। స్ఫారీముద్రాభిరామదోరంతరసీ
మారత్నాలంకారున। కారూఢమునీంద్రవర్ణితాకారునకున్. 93

క. క్షీరాంభోనిధివీచీ। పారంపర్యాంతరాహిపతిపర్యంకా
సారసుఖయోగనిద్రా। ధౌరేయునకవిరతాశ్రితవిధేయునకున్. 94

క. దోషాచరయోషాగళ। భూషావిశ్లేషకారిభుగ్నభ్రుకుటీ
రోషాన్వితవేషునకున్। భాషాపతివినుతిజనితపరితోషునకున్. 95

క, వారణవరభయవారణ। కారణపూర్ణప్రయాణకౌతుకమతికిన్
ధీరజనతాభవార్ణవ। తారణనిజనామగుణకథాసంస్తుతికిన్. 96

క అనిమిషకచ్ఛపకిటివ। ర్యనృకేసరిఖర్వభృగుజరాఘవహలసా
ధనకృష్ణబుద్ధకల్క్యా। ద్యనుపమరూపునకుశ్రుతిమయాత్మునకున్. 97

వ. సభక్తికంబుగనే సమర్పింపం బూనిన ధరాత్మజాపరిణయంబను మహాప్రబంధంబున
కుంగథాప్రారంభంబెట్టిదనిన. 98

క. వెలయునిలయందుభూభృ। త్కులవర్యుఁడుసుగుణరత్నగురుఖనిజనకుం
డలఘుసమున్నతిచేన। జ్వలితయశోభారమహిమవంతుండనఁగన్. 99

గీ. మహితవనజాతరేఖాసమగ్రములగు। తనదుపాదంబులెభజించియనుదినంబు
కింపురుషులతివిభుధనత్కీర్తి వెలయ। నతఁడునుతిఁజెందెనఖిలదిగంతరముల. 100

గీ. సమదమృగరాజ శార్దూల శరభసమితి। యసదృశంబనఁదగు సత్త్వమధిగమించి
నిజభటశ్రేణి పోణిమినెఱపుచుండ। నచలరాజత్వమునమీఱె నవ్విభుండు. 101

సీ. విమలనీహార పూరమనోజ్ఞతవహించెశశికాంతమణివిలాసంబుగనియెఁ
జందనక్ష్మాజాత సందర్శములమీఱెహీరఖనీలక్ష్మిఁనేఁపుఁగాంచె
గంగాంబుసంబంధ శృంగారమునమించెఁ బుండరీకవనవిస్ఫూర్తిఁదనరెఁ
దర్పితహరియూథదర్శనీయతఁగాంచెఁ జామరనికరాభిరామమయ్యెఁ
జెలఁగెమఱియు ననంతసుశ్రీలనుచు। విబుధనిచయంబులాఘునవిపులకీర్తి
యధికముగఁగొనియాడుదురహరహంబు। భూరసాతలదేవతాభువనములను 102

గీ. తత్కటకసంశ్రయంబుచేఁదనరుచున్న। యధికతరులమహత్త్వమేమనినుతింప
నలవియగు నిత్యసుమనోగుణాభివర్ణ్య। కీర్తిసంతానకల్పకస్ఫూర్తిమీఱ. 103

వ. ఇవ్విధంబునఁబ్రకాశంబుఁగనునవ్విభుండు. 104

గీ. అలపితృమనఃప్రభూతశుద్ధాత్మయోగ। సుగుణశోభితమేనసంస్తూయమాన

విశ్రుతివహించుచునుదారవిహితధర్మ । సరణివిలసిల్లునధికవిస్ఫురణఁగాంచె. 105

గీ. అనఘమైనాకశుభసమాఖ్యమజెలంగి । వనధిసంవృతి విలసిల్లుతనయురూప
శోభితావనిలోకసంస్తుత్య కీర్తిఁ । జెందివిలసిల్లెనధిగతానందుఁడగుచు. 106

క. ఆసుగుణరాజితనయుఁడు । భాసిల్లెఁగదాఘునస్వపక్షసహితుఁడై
వాసిగఘోరబలారిదు । రాసాధ్యతనపవిఘాతుఁడనిజనులెన్నన్. 107

గీ తతరసాతలగతమహాహితసువర్ణ । హరిరత్నవినిస్మితహ ర్మ్యవితతి
నాగకాంతారతులఁజెందియాగుణనిధి।యశముప్రకటంబుఁగావించెననుదినంబు. 108

గద్య.—ఇది శ్రీమద్భవానీశ్వరశాశ్వత కృపాపాత్ర సహజపాండిత్య
మృత్యుంజయ నామధేయ ప్రణీతంబైన ధరాత్మజా పరిణయంబను
మహాప్రబంధంబునందుఁబ్రథమాశ్వాసము.

---

# ధరాత్మజాపరిణయము.

## ద్వితీయాశ్వాసము.

శ్రీవిలసితసకలధరి । శ్రీవలయారూఢరాజదేవోత్తమలో
కావాసకామవిరహిత । సేవకసదయస్వభావ శ్రీహరిదేవా. 1

గీ అవధరింపుమిటుసమస్తభూభృజ్జాత । వర్ణనీయమైనవైభవమున
నచలరాజ్యలక్ష్మీశ్రయక్షయసితయశో । విలసనమున ననుభవించుచుండె. 2

వ. అతఁడు ధర్మైకనిరతుఁడై వలిఁగాలం గొంతసమయంబుగడచెం దదనంతరంబున. 3

సీ. దరశరజ్జలదసుందరకీర్తిజనకుండువరనీతిదక్షుండుసురుచిరహిత
శివసమాగమముగసవనంబుఁగావింపవినియతిగాథసంజనితమైన
మానసామోదంబుమల్లడిగొనుచుండఁజనియమ్మహాభావనిస్థలినిదాన
వన్మానగతినికర్షమొనర్చిమేన్వాసియరుదెంచిబుధకోటియభినుతింప
సతియుదారలక్ష్మీశ్రచాలనుజ్వలలీల । వర్ధరాంగనాసమంచదుదర

సీమజననమందియామహీభృత్కులో । త్తంసమునకునాత్మతనయయయ్యె. 4

సీ. అమరనదీస్నానమాచరింపకమున్న యున్నతప్రమదాబ్ధినోలలాడెఁ
గ్రతువులుపట్టణమలలంకృతులుసేయకమున్న లలితాత్మవంశమలంకరించె
సదయుఁడై యవరుద్ధజనులవీడకమున్న పితరులముక్తిసంగతులఁ జేసె
నర్థికామితసిద్ధి యాచరింపకమున్న నిజమనోరథపూర్తి నిర్వహించె
సకలజగదేకజననియాసతియుదార । రమసమంచితసుగుణాభిరామయగుచుఁ
దనతనయయైన యమ్మహోత్సవమునందు । ధీరమతియైన యద్ధరాధీశ్వరుండు. 5

క. విస్మరపరాగమోగో । ల్లసితప్రసవరసపానలాలనవిసర
ద్ధ్వనలకులంబులుపొగడం । గొనరకకుసుమములముసురుఁగురిసిరిదివిజుల్. 6

సీ. రచితలాస్యారంభరంభాదిసురవధూమంజుమంజీరాది శింజితములు
పద్మోద్భవామోదవద్యాగభూజ్ఞాతవిద్యమానాతోద్య విలసనములు
గద్యపద్యాదిసంపద్యమానస్తోత్ర వందిసందర్భవాగ్వైభవములు
సాదరధృతవేద మేదినీసురలోక సంభృతాశీర్వాద సంభ్రమములు
వృద్ధపుణ్యాంగనాగీత విభ్రమములు । శంఖకాహళభేరికాశబ్దములును
నేకఘోషంబుగానద్ధరేశ్వరుని । పురవరంబున మొలసెనద్భుతముగాఁగ. 7

క. జనియించెఁ జాలరుచిజృం । భణమలరుచునున్నదీ ప్రమదనాసీతా
భినుతాభిఖ్యయనందగు । ననిపల్కిరిచాలనచటి యార్యజనంబుల్. 8

గీ. భాస్వదచలభూతిఁ బార్వతియానన । జననిగదితవాక్యసరణిఁ బొగడఁ
దగినశ్రీసమాఖ్యఁ దానుమాదేవియు । ననఁగవన్నెఁగాంచె నామృగాక్షి. 9

క. ఈలీలంజనియించిన । బాలామణిదినదినంబు ప్రతిపచ్ఛశిరే
ఖాలక్ష్మిఁ బూనిరసికజ । నాళుల్నుతిసేయవృద్ధినందుచునున్నన్. 10

గీ. దేవమునిసన్నుతాత్మప్రభావుఁడద్ధ । రాధిపతి మొల్లనొక్కనాఁడబలఁజూచి
యీలతాతన్వికే రాజమౌళిభర్త । యౌననుచు నిశ్చయించెఁదానాత్మలోన. 11

గీ. అనుచుగురుజనములతోడ నతిరహస్య । వృత్తినూహించిపలికె యవ్విమలబుద్ధి
జననిరూఢమహామోదసంభ్రమమున । వివశుఁడగుచును బ్రీతినగావించెనిట్టుల. 12

గీ. ఇంకనిశ్శంకవృత్తి గిరీశచాప । మానతంబుగఁ జేసినయట్టిరాజ
మౌళికేకానియున్నయమర్త్యపతుల । కీవధూటిని నర్పణంబేనుసేయ. 13

వ. అనిపలికినఁ దద్బంధుజనంబులందఱు నతనియవితథాలాపంబులకు సంతసంబు వ
హించిరదియట్లుండెఁ దత్పూర్వకాలంబునందు. 14

సీ. గురుపుణ్యజనమహాదరయుక్తిఁ దేజోయుతకృశానుచారిత్రదశరథుండు

నారంజిలుసమాఖ్యమీరునాశ్రితసదావళిభాస్వదన్వయవర్ధనుండు
పృథులాసమాస్త్రధారి విభూతియుక్తుండు సన్నుతార్యశ్రేణి శంకరుండు
పూర్వభవక్రోధపూర్ణరీతి కామచర దక్షకృతమఘుంబురునిమిత్త
ముగను దనయాలితోఁబాసి భూరితాప। సహితవృత్తివహించినిజప్రధాన
గణములుభజింప సుగుణయోగంబుచేత । నచలరాసవిధమున నలరుచుండె. 15

గీ. ఆత్మయోగబలంబుచే నమ్మహుండు । నిర్జితాశేషవిషయుఁడై నిశ్చలముగఁ
దనకుపాస్యులుపుటిలేమిననుపమముగు । స్వానుభవమునమీఱెననారతంబు. 16

గీ. అంతబహువర్షములుచన్నయట్టిపిదప । నలరునారాజనందనవిలసితమగు
సిరివహించినదామోదభరితుఁడగుచు । మీఱెవిబుధౌఘములుతన్నుఁజేరిపొగడ. 17

సీ. అపుడుసర్వజ్ఞపదాశ్రయ ఖ్యాతిచేనలరారుగోపతియాస్వకీయ ।
గణములనీక్షించికడఁకతోనిట్లను బ్రకటవిజ్ఞానసంపన్నులార
ఘనులారయీయనందనచింతచేనున్నయతిఘోరకర్మయోగానుబంధు
ననుగతాత్మానందుఘనతాపసహితునివీక్షించుచునుమీరువిపులమాన
రీతినుండఁజెల్లునాతత సర్వేశ్వ । రాజ్ఞలంఘనీయమగునెమునకు
నుచితమిందుకహర్షయోగవిశేషన । మాశ్రయమునఁ గాలయాపనంబు. 18

గీ. అధికబుద్ధిమీఱయాగోర్జితఫలంబు । గతనమోదయంబుఁగాంచుటకును
సభ్యులారమానసముదివిరెడునాకు । బుద్ధిమీరలుతలపోయుఁడింక. 19

గీ. అనినమాటకంతనాసుమంత్రిముఖాప్త । గణములెల్లనధికగౌరవమున
హర్షమందుచుండిరధికతానందుఁడై । యవ్విభుండు నిశ్చలాత్ముఁడయ్యె. 20

చ. అనఘవశిష్ఠముఖ్యమునులవ్విబుధౌఘముఁగూడి యమ్మహా
వనివిభుఁబూర్ణభూతిభవువర్ణితతేజునిఁజూచివేడుకం
జనివిలసిల్లుతద్విపులసంజనితప్రమదాన్వితాధికా
ననసుషమంగనుంగొని మనంబుననుబ్బుచుఁబల్కిరీక్రియన్. 21

గీ. లబ్ధభవదాస్యవనజాతలక్ష్మిఁజూచి । యాయతామోదభరమబ్బెనీయజాత
శాత్రవోద్యోగసత్వలక్షణమువింత । యనుచుఁదత్సాధుమార్గాశయంబుఁదెలిసి. 22

సీ. కమనీయఋశ్యశృంగప్రయోగంబుచేహరికినత్యామోదమతిశయిల్ల
వర్ణితముత్సమవాయసకౌశికప్రకటసుపర్వసంభ్రమము వెలయ
మానితాహీనసమాగమమైత్రిచేఁబ్రౌఢిమూపినకులంబలరుచుండ
హయమేధమానతాభయరాజమానకాసరవినియతవృత్తిజరుపనిశ్చ
యాప్తనందనలక్ష్మిచేనలరునీస । మగ్రతరభవనోత్తమమహిమఁజూచి

సమ్మదాంబుధినోలాడుసజ్జనులకు । నీప్సితములెల్లఁబూర్తివహింపఁగలవు. 23

గీ. సకలమహితరుగర్వమోచనముఁజేసి । ధన్యతవహించిసుమనోవతంసములగు
నధికతరులభజించియథార్థవృత్తి । నెనఁగసత్కర్మసిద్ధియయ్యెడలభించు. 24

గీ. ఘనశిలీముఖసముదయోగ్రంబులైన । యతనుబలములసన్నాహమతిశయముగ
వెలయనేతన్మహావనిస్థలమునందు । రుచిరగంధర్వసంచారముచితమరయ. 25

గీ. అంతరూఢహర్షమందువర్షాంతావ । సరముననిజకర్మసఫలతాప్తి
కమితసారసలలితాశ్వాగమముచూచి । రాజహంసనభవిరాజితముగ. 26

చ. అవిరళతద్వసంతఋతువందునమందతరాఖిలద్విజ
ప్రవరముఖోదితశ్రుతిసుపర్వసమాగమహేతువాక్యముల్
వివిధగతింజెలంగఁగనువృత్రహముఖ్యులకున్లభించునా
నవనమునన్యథేష్టముగసంచరణంబొనరించియుబ్బఁగన్. 27

గీ. అనుచువిబుధులిట్లుహర్షంబుతోడవ । దించిరంతరాజశేఖరుండు
తనయకామయోగఘనకర్మమచలద । క్షతనదీక్షుఁడగుచుజరుపుచుండె. 28

సీ. రాజమౌళిసుబుద్ధిరజ్జువుచేమన్యుహయవతంసంబునుబ్రయతమాన
సద్యూపబద్ధమైచలనమందకయుండఁజేసిఖండించివిభాసురతర
సవిశేషహవ్యప్రసన్నాగ్నిముఖముచేదేవతావలియెల్లఁదృప్తిపడయ
శాంతాసహాయనిశ్చలమునీశ్వరమతక్రమమొకయింతైనఁగడమవడక
యుండనుదితభాస్కరోపమసముదీర్ణ । తేజుఁడైచెలంగెధీరులెంచఁ
జాపలంబుమానితాపసాంగీకృత । క్రియలునడుపుచుండెఁగేవలంబు. 29

గీ. ఆతపంబుఁజూచియతివికాసమునొందు । నంబుజములఁబోలియాననములు
మేదురాద్భుతప్రమోదముల్లఁజెలంగ । నన్నుతించిరపుడుసకలజనులు. 30

గీ. తనయనంతవినయదాక్షిణ్యయుతబుద్ధి । నద్ధరాధినాథుఁడలఘుయశుఁడు
వామదేవముఖ్యవరపరిచర్యకు । నర్పణంబుచేసియలరుచుండె. 31

సీ. ఆసమయమునశౌర్యక్రియాసంతర్జితావనిజనపంక్తిరావణుండు
నిర్జితాలీగర్భనిర్భేదకోపకృతభ్రుకుటీతీవ్రదశముఖుండు
పాతాళనిలయవిఖ్యాతదానవసముత్పాటనాద్భుతధనుష్పాటవుండు
దీపితాత్మీయప్రతాపసూర్యప్రభాదూరితాకులవైరితారకుండు
సబలుఁడైలోకములయందుశంకలేక । సాధుగోవిప్రహింసనాసాధువృత్తి
సలుపునాపదఁదరియించుజాడయొకటిఁ । గానఁగాలేకసురలెల్లగములుగూడి. 32

ఉ. ఇట్టిమహాపదల్గడుపనెవ్వఁడుదిక్కుగలండుమాకుమే

మెట్టుజయించువారము సురేంద్రముఖామరకోటికైన నే
పట్టున వీఁడసాధ్యతఁ దపంబునఁ గాంచినవాఁడు వీనిఁ బోఁ
గొట్టెడు దేవు వేఱొకనిఁ గోరి భజింతమటంచుఁ బల్కుచున్. 33

వ. చనిచని ముందట. 34

ఉ. అత్యలఘుప్రభాయుతము నైసతతంబవృతైకధామమై
సత్యసమాఖ్యమైన విలసద్భువనంబును సంవృతాఖిల
క్షిత్యభిరామశుభ్రతరకీర్తిసుధాజలరాశిపుణ్యసాం
గత్యము చేతనందఱును గాంచిరి దేవతలుత్సుకాత్ములై. 35

సీ. అద్భుతంబైనయాయమృతధామమున భీతత్రిలోకాభయదానశక్తి
సంలక్షితాహీనశయను నింద్రధ్యేయపాదారవిందుఁ బ్రపన్నలోక
మందారుఁ జిన్మయానందస్వరూపుఁ జంచలమనోవర్తనజనవిదూరు
నైసర్గికదయావిలాసకటాక్షు నిర్నిద్రభాషాపతినిత్యసేవ్యు
లాలితాత్మబుద్ధిలక్ష్మీసమేతుని । భూరిభక్తపాపవారణపటు
హరిని విశ్వభర్తనజుని నిరీక్షించి । దేవసంఘమిటు నుతింపఁదొడఁగె. 36

క. సర్వజ్ఞ సర్వశుభకర । సర్వజగన్నాథ సర్వసద్గుణనిలయా
సర్వోత్తమ సర్వాశ్రయ । సర్వామరపూజనీయచరణసరోజా. 37

చ. పరిచరభక్తలోకసురపాదపపాదపయోరుహానతా
దరదరహాసకాంతిసముదారవికాసముఖారవిందభా
సురసురలోకభీతికరశూరతరాసురసంగరాగ్రభీ
కరకరణానుశాసనవికస్వరచిత్తమునీంద్రభావితా. 38

ఉ. క్షేమకృతే సదాదురితఖిన్నజనావనపావనోల్లస
న్నామభృతే సమస్తసురనాయకగేయగుణావళీకథా
భూమవతే జగజ్జననపోషణసంహరణప్రవీణని
స్సీమమతే నమోస్తు సురశేఖరతే ప్రథితక్షమావతే. 39

క. నిధయే సుగుణానాం శే । వధయే నమతాంజనాభివర్ణితకరుణాం
బుధయే గురుకైవల్యా । వధయే నిఖిలాగమాభివాద్యాయ నమః. 40

లయగ్రాహి.

ఓ చిరకృపాదరచరాచరమయుండవగు నీచరణకంజయుగమే చిననిజాంత
ర్లోచనము చేత నెవివేచనముగా నెపుడు జూచుచరితార్థులకు గోచరమగుంగా
కేచపలచిత్తయుతనీచతరదేహులకు నీచరితమెన్నఁగను గోచరముగాదే

ధీచతురభక్తభవమోచనసుధాకరవిలోచనసమేతనిజలోచనసురేశా. 41

సీ. కమలసంభవుఁడవై కరుణలోకములెల్లఁ గల్పింపనేర్చినఘనుఁడవీవ
విష్ణురూపంబుచే వివిధప్రపంచంబు రక్షించుకరుణాంబురాశివీవ
యీశ్వరాకృతిచే తనీరేడుజగములలయముఁ గావించుదుర్జయుఁడవీవ
యఖిలజంతువులకు నంతరాత్మయసంగభాసిల్లు నాపరబ్రహ్మమీవ
చంద్రసూర్యాగ్నిమేదినీసలిలపవన । గగనరూపంబులువహించుఘనుఁడవీవ
కాలయముఁడవు నీవనీ కడిఁదిమహిమ । నిశ్చయింపఁగ నెవ్వారు నేర్తురభవ. 42

క. పాపపుదానవకోటుల । కోపానలకీలలోనఁ గూల్పఁగరుణచే
నాపన్నజనులయంత । స్తాపముమాన్పంగనీకె తగుసుమహాత్మా. 43

క. వెక్కసపురక్కసునిచే । నెక్కువయాపదలఁ బొందియేమిందఱముం
దిక్కెవ్వరిఁ గానకయీ । దిక్కుననీమఱుఁగుఁ జొచ్చితిమి దేవేశా. 44

ఉ. మాద్యదనేకదేవగణమర్దననిర్దయకోపదుర్నిరీ
క్ష్యద్యుతితారకుండుదితిగర్వితవాగరిపంక్తికంధరుం
డుద్యతహేతియైజగములుగ్రతఁ గూల్పఁ దొడంగె మాదృశా
భేద్యునివానిఁ గూల్చి యతిభీతులమమ్ములఁ గావవే యజా. 45

గీ. ఆదురాత్ముండు జేసినయాగడములు । వరుసతోఁ జెప్ప నెవ్వారివశము గాదు
కొన్నిఁటికిఁ గొన్ని వివరించుచున్నవార । మవధరింపుము నిఖిలదేవాదిదేవ. 46

గీ. కలుషమతియైనయాలోకకంటకుండు । త్రిదశులనేకదశలఁ బొందించుచుండఁ
దమచతుర్దశభావంబుఁ దలచిచూచి । మనువులుదలంకుచురుచాలమనములందు. 47

సీ. వాఁడెవ్వఁడే పాకవైరియల్లైనచో నదిమహానసగృహంబ చటఁ దొలఁగు
నీవెవ్వఁడవు రోరి నిజము నే సమవర్తి నాదీపపాత్రమీ వాశ్రయింపు
తానెవ్వఁడో నాకుఁ దగునయ్యవరుణాఖ్యయరుగు వేఁగమ కాననాంతరమున
కదియెవ్వఁడో విశ్రవోపత్యమనఁ జాలు వికలాంగుఁడవు నీవు వెడలరోరి
యనుచువక్రోక్తులాడుచు నసురరాజు । ధర్మనాకాంక్షఁ జనునట్టి దైవతముల
వెడలనడఁతురు తద్ద్వారవేత్రధరులు । విభవమున వాఁడు కొలువున్న వేళయందు. 48

చ. బొమముడిచూపునద్దనుజపుంగవునాస్యముఁ జూడనోడుచు
న్విముఖతఁ జెందినప్పుడు సువృత్రవిరోధియదర్శనంబులే
కమితభయంబుఁ జెందియహహా! మదిఁ గుందెడునిర్నిమేషనే
త్రములకొఱంతమంతయును దట్టముఁ జేసినదైవచర్యకున్. 49

గీ. అన్నపానంబులిడనీక యదయుఁడగుచు । ననలునరికట్టనధికక్షుద్ధార్తుఁడగుచుఁ

నబ్బినదియెల్లమ్రింగ నాఁడాదిగాఁగ । సర్వభక్షకుఁడతఁడయ్యె జగములందు. 50

చ. తరణిసహస్రతుల్యరుచిదర్పితమైనకృతాంతదండమున్
దురమునఁదీవ్రవిక్రమముతో నెదిరించినవాసముఁదరం
గరము నిరర్థమయ్యెఁదడఁగాళ్ళవడన్వడిఁబాఱిపోవుచోఁ
గరమునకూఁతయైనలిపెగాయుపకారము నాత్మభర్తకున్. 51

ఉ. ఉత్తమదైత్యవంశమున నుద్భవమందియు హీనవృత్తిచే
నిత్తఱినాక్రకోణమునకీశుఁడవైతివటంచు నెబ్బులి
న్నత్తుఁడువాఁడు చాలనవమానముఁజేసి తిరస్కరించుచున్
మొత్తకమానెబంధువను మోహమొకించుకయాత్మఁబర్వినన్. 52

గీ. భువననాథుండనేఁగల్గ భువనపతివి । నీవు నెట్లుంచువరుణునినిగ్రహింపఁ
గానె నేవనపతినన్నఁగనలివాఁడు । పట్టిసేయించె నారామపాలనంబు. 53

ఉ. ఆయతసాహసుండు దనుజాధిపుఁడమ్మలయాద్రిపైఁబడ
న్వాయువునుగ్రుఁడైవినరివైచినరూపము వాసియొక్కసం
స్థాయము లేక మందగతిసర్వవనంబులఁజొచ్చియంతఁబా
పాయతిఁజేరిగంధవహుఁడై మఱివానిభజించెనీశ్వరా. 54

చ. నవనిధులున్హరించి మదినమ్మకయున్మదవృత్తిచేమఱి
న్నవనిధులున్నవంచు ధననాథునియింటిసమస్తవస్తువుల్
దివిజవిరోధి దోఁచుకొనదీనతనాతఁడు భైక్షవృత్తికిం
దివురుచుఁగాదెడిన్స మొలదేవునితోనొనరించెసఖ్యమున్. 55

ఉ. రుద్రగణంబు నిర్జరవిరోధిశరాసనముక్తసాయకో
పద్రుతమై త్రిశూలములు పాఱఁగవైచిన నాత్మలందున
క్షుద్రపరావమానమయశూలములన్ధరియింతు రెప్పుడు
న్నద్రజితాత్మశూలధరసంజ్ఞకునర్థము గాకయుండఁగన్. 56

చ. ప్రణమితవైరిరాడ్దశకరద్వితయాప్తిని నేఁజెలంగఁగా
ననవరతంబు నీకును సహస్రకరాఖ్యవహింపఁజెల్లు నే
యనని దెనీకు వేయుబలులర్పణ సేయుఁదదాఖ్యయుక్తమై
చనియెననంగభాను నెడశాంతివహించె సురారియెంతయున్. 57

చ. పరతరుణీవిలాసములభావమునందలపోసిభాసుర
న్మరశరపీడితుండగుచుఁజంద్రునిఁజూచి సహింపలేకయా
సురరిపుఁడుగ్రసాయకము సోఁకఁగనేసినగంటు నేకదా

నెరులుకళంకమంచునమనమ్ములనూహయొనర్తురెప్పుడున్. 58

గీ. అశ్వదంతావళాందోళికాదులైన । వాహనములెన్నియెన్నియువరుసతోడ
నతఁడుహాటియింపవిసివిధరాత్మజుండు । మేషవాహనుఁడయిగతద్వేషుఁడయ్యె. 59

గీ. అమితపాతకియగునీదురాత్ముగ్రహమోలెఁ । గనఁబడుటకూడదనియప్రకాశుఁడైన
చంద్రసుతువివేకమునకుసంతసించి । బుధులుబుధుఁడంచునాతనిఁబొగడిరధిప. 60

గీ. గురుఁడనుచుఁబల్కుదురునిన్నుఁగువలయమునఁ । జూతమేపాటియోయనిచేతనెత్తి
యతిలఘునిఁజేసిజీవయంచతఁడువిడువ । నమరగురునకుఁగల్గెజీవాహ్వయంబు. 61

చ. బలిమిమెయింబురోహితునిఁబట్టినిరోధముసేయుఁడంచుమం
త్రులఁగనిపల్కుదానవగురుండగుదోషముచేతఁగావ్యుని
న్నలియఁగమొత్తిరద్దనుజనాథునకున్గలివార్తనేటికిం
దెలియదుదుష్ప్రవేశసముదీర్ణగృహాంతరసీమనుండఁగన్. 62

గీ. భానుతనయుండుపూర్వంబుపాదమంత్ర । ఖంజతవహించియిపుడుదోర్గర్వవివశ
దానవాధీశసంగరస్థలమునందుఁ । గరముఖంజతఁగాంచినాఁడరసిచూడ. 63

సీ. ఖండింపరావంటకట్టియలకుఁబారిజాతావనీజాతశాఖలెల్ల
నీళ్ళుమోయింపరాత్రుళ్ళిరంభామేనకాప్రముఖాప్సరోగణముచేత
మూటలెత్తింపరామొనసిహూహూముఖ్యగంధర్వతతిభుజాగ్రములయందుఁ
దోలికట్టింపరాయాలకంబులమందధర్మంబుమానిసుధర్మనడుమఁ
బట్టియరికట్టరావీధినట్టనడుమ । నింద్రునరిగాఁపువోలెదైత్యేంద్రభటులు
పాలకుఁడులేనియంచితపల్లివోలె । దివిజపురివాఁడువేలంబుదిగిననాఁడు. 64

గీ. జలవిహంగికలెత్తనజరుగుసురకు । మారకులఁజూచిమీకునుమాకుఁబలెనె
ఘనపయోధరకుంభముల్గల్గెనంచు । వేల్పువెలయాండ్రునవ్విరివీధులందు. 65

సీ. ముదిపొన్నలకుఁబ్రాయమొదవఁజేయుఁడటన్ననిలువునీరైరశ్వినీతనయులు
పాలువోవకకేలువట్టిలాగుచుఁజాలనలపించిరప్సరోజలజముఖులు
నమృతకుంభముఁజూపుఁడనుచుఁబెద్దలఁబట్టిబాధింపఁజొచ్చిరిబహువిధముల
ననమయంబునయాగహవ్యముల్దెమ్మంచునాపదఁగావించిరనలుఁజేరి
స్వర్గపురిఁజేరిదానవుల్శంకలేక । సలిపినట్టియకార్యముల్గలవుపెక్కు
కొన్నిమీతోడవివరించుకొనఁగలజ్జ । వొడముచున్నదివినవయ్యయసురేశ. 66

ఉ. కదనతలంబునన్బహుముఖంబులవచ్చుమహాస్త్రసంపదం
బదిలుఁడుమాయలన్నిగులఁబ్రౌఢిమఁగాంచినయావిభుండుదు
ర్మదుఁడయిచేసినట్టియవమానములెల్లఁదొలంగెనేడుమీ

పదములసన్నిధిన్నడుపుభాగ్యముమాకులభించెఁగావునన్. 67

క. దానవునిత్రుళ్లడంపన । నూనోపాయంబునాత్మనూహించివడిన్
దీనావనకారుణ్యని । ధానా కావింపుమభయదానముమాకున్. 68

చ. అనుచుఁగృతప్రణాములయియాసురకోటులువిన్నవింపఁగాఁ
గనుఁగొనలంబ్రవృద్ధమయికన్పడునట్టికృపారసంబుతో
వనరుహసూతివంద్యుఁడుదివాకరకోటిసమానతేజుఁడా
ఘనుఁడిటువల్కెనంబుధరగర్జితసారగభీరవైఖరిన్. 69

సీ. చలియింపకుండుఁడీసకలదిక్పతులారభయముఁజెందకుఁడీసువర్వులార
బెదరకుఁడీప్రాణభీతిఁగిన్నరులారసహించియుండుఁడీసాధ్యులార
కార్యమూహింపుఁడీగంధర్వతతులారచీకాకుపడకుఁడీసిద్ధులార
దూరకుఁడీనన్నుఁజారణోత్తములారధైర్యంబువిడకుఁడీతపసులార
బుద్ధిఁబదిలంబుసేయుఁడీభుజగులార । విడువుఁడీఖేదమంతయువిహగులార
తాళుఁడీయొకయింతగంధర్వులార । మఱువుఁడీదైత్యబాధలమనువులార. 70

గీ. దుష్టదైత్యునికాయంబుత్రుళ్ళడంచి । సాధుగోవిప్రసురకోటిబాధమాన్పఁ
జాలుపడియున్ననేనుమీపాలఁగలుగఁ । గలకనందెదరేలనిష్కారణంబు. 71

క. జనకోటికిమద్దర్శన । మొనఁగూడినదాఁకఁగాకయొదవునెమఱియా
వెనుకవిపల్లేశంబులు । దినకరుఁడుదయింపఁగలవెతిమిరచయంబుల్.

వ. ఐననింకొక్కరహస్యంబుగలదు వినుఁడు. 72

గీ. కాలపరిపాకవశముచేఁగలుగుచుండు । నలఘుసుఖదుఃఖములుజంతువులకుఁగాన
నుబ్బుస్రుక్కులుమదిలోననుడిపిసమత । ననుభవింపఁగవలయుధర్మైకఫలము. 73

సీ. అమవసనిసియేమియత్నంబుఁజేసినఁగలుగునేపండువెన్నెలమెఱుంగు
జలదవేళలనెంతసాధింపఁబోయినదొరకునేచూతమంజరులసిరులు
నైదాఘముననెంతనైపుణ్యముననైననబ్బునేతుహినసమాగమంబు
బాల్యంబునందునెప్రౌఢిమఁజూపినసమకూరునేనిండుజవ్వనంబు
కాననేవేళనేపనిఘటితమయ్యె । దైవవశముననదియేలతప్పిపోవుఁ
బురుషయత్నంబుచేనెంతపొరలుచున్న । మూఢజనులకుఁదెలియదీమూలమెందు. 74

గీ. కానదైత్యునకుపచయకాలమిపుడు । మీకునపచయకాలంబుమీదనవియు
రెండువిపరీతవృత్తిచేనుండమీరు । సౌఖ్యమువహింపఁగలరునిస్సంశయంబు. 75

గీ. రణధరాఖండితాసురరాజరాజి । హరమహావీర్యముననుదయంబుఁగనిన
పురుషుఁడొక్కరుఁడభివృద్ధిఁబొందెనేని । గలుగునుపహతియాలోకకంటకునకు. 76

సీ. దేవసహాయుఁడైదివిజారికులములుద్భటశక్తిఁగూల్చినధన్యుఁడంజి
భువనవర్ణితధైర్యబుద్ధిరీశుండుమతిఁబోలతపహింపకతనుజాత
యోగసౌఖ్యముఁగోరియాగురుమతమునశుభదృష్టిసల్పియుత్సుకతనాస
వనభూమినినదీక్షఘనుఁడయియున్నవాఁడాయననిజపత్నియందుహర్ష
మొదవనేవరయుక్తిచేనుదయమైన । యత్నమొనరింపవలయుమీరనఘులార
మదనునరణంబుచేతసమస్తకార్య । సిద్ధిసమకూరునామీదసిద్ధమిదియు. 77

గీ. సకలవినుతనీతిఁజతురాత్మతవహించి । రేనిధర్మమమరఁబూనిరామ
వరసమాఖ్యచేతవరలుదురారాజ । లక్షణములసిరులదక్షతఁగని. 78

సీ. అనిపల్కియజుఁడంతనంతర్హితుండైనసురలెల్లనామోదభరితులగుచు
నచ్చోటువాసినమంచితపుణ్యఫలావాప్తిచేఁజాలనద్భుతంబు
గనవారితోదయోక్తినిహేమగర్భుండుమనమునసుత్సాహమగ్నుఁడగుచుఁ
బలికెనీరీతిచేఁబ్రభుఁడుజనించునభ్యుదయస్థిరతరాలోకమునను
మదనునయమునమన్నించిముదముచేసు । మాపతిసమదిరామసామ్రాజ్ఞిమీర
నలుపవలయునుహార్యాత్మజవరమహిమ । ననుచునారీతియగుననిచనిరివారు. 79

గీ. ఆధరాధినాథుఁడాత్మతనయవాంఛ । పూర్తిఁజెందుటనునుభూమిసురల
యనుమతమువహించియధికసంతోషిత । దేవయజనమునసుదీర్ణమయ్యె. 80

మ. సతులుండాననుసత్క్రియల్పలుపుచోసంచిన్నకరాగ్రంతరా
యతఁడాఁబాయసపూర్ణపాత్రకరుఁడైయగ్నిప్రజన్తోత్రసం
యుతుఁడైకన్పడెనొక్కపూరుషుఁడుతుల్యుండెక్కడన్లేకయు
న్నతభాగ్యక్రమసూచకాభ్యుదయుఁడైనవ్యాగ్నిధామంబునన్. 81

సీ. శుచిపూరుషానీతరుచిరపాయసమునువిమలాత్మసతులకువేడ్కతోడ
భుజియింపఁగాజేసిభూసురాశీర్వాదఘోషంబుసకలదిక్కులఁజెలంగఁ
బౌరవైదేశికబాంధవభృత్యాప్తజానపదాదులౌసకలజనుల
భక్ష్యభోజ్యాదిసంపన్నయథేష్టాన్నభూరిదానములఁదృప్తులనుజేసి
మఱియుఁదగువారలకునిచ్చెమణివసనసు । వర్ణధేనుమహారౌప్యవాజిభృత్య
పురవరగ్రామసామజభూషణములు । శశ్వదామోదనిధియైధరేశ్వరుండు. 82

క. ప్రభుఁడైనయతనికాంతలు । విభవమ్మననిష్టసిద్ధివిలసిల్లంగా
శుభగర్భలక్షణంబుల । నభినవముగఁగాంచిరంచితానందముగన్. 83

సీ. తదనంతరమునసాతరుణులంచితభాగ్యఫలలాప్తనవమాసభవ్యలగుచు
రామముఖాభిఖ్యులైమేటివారలననుపమవేదవేద్యాత్మగతుల

సత్తమవిబుధులనుదితభావ్యర్థపరిష్కారంబుచేతనఖండితప్ర
హోదరితులఁజేయుమునిలోకవినుతులఁబ్రఖ్యాతవాక్ప్రౌఢిగీష్పతులసుతుల
దర్శనీయులఁగనియథార్థంబుగాఁగ । నబ్బెసుతవాంఛితమునసంశయమ్ముమానెఁ
ప్రాగ్జననపుణ్యపరిపాకవశముచేత । ననుచుసంతోషవతులైరహర్నిశంబు. 84

మ. అనఘుండావిభుఁడర్థసత్క్రియలునెయ్యంబొప్పఁగావించియిం
ద్రునిరీతిన్విభవంబుఁగాంచితనయారూఢాభిలాషంబునే
డనయంబుల్ లభియించునంచుమదినత్యానందసంపన్నుఁడై
తనరెన్మిత్రపురోహితాప్తజనసంతానంబుతోఁగూడఁగన్. 85

గీ. తత్సుతాగ్రజుఁడుసుదక్షిణోపనయన । స్ఫురణసూచితశుభగరిమమగుచు
జరగరాజితగిరిశస్వామిసత్కీర్తిఁ । గాంచుటకునుగౌతుకమువహించి. 86

గీ. అవ్విభుండునుదనయకల్యాణరూప । మగుమహోత్సవమెపుడునాకబ్బుననుచు
నుల్లమునఁజాలనువ్విళులూరుచుండెఁ । బూర్ణశశిరాకఁగోరునంబుధియువోలె. 87

మ. హరినీలోపమసుందరాంగ హరిదంతాధీశసంసేవితా
హరిదశ్వాయుతకోటితేజ హరిజన్మావాసహృత్పంకజా
హరిపుత్రానుజసూతకృత్యచణ హర్యారూఢశయ్యాప్రియా
హరినారాయణవాసుదేవహరిమధ్యాలంకృతోరస్స్థలా. 88

క. సద్యోగజాలకామిత । సద్యోముక్తిప్రదానచాతుర్యనిధీ
ప్రద్యోతనశతకోటి । ప్రద్యోతనదివ్యతేజప్రణతబిడౌజా. 89

మాలిని.

జగదవనిజమూలాసర్వలోకైకపాలా । సగుణవిగుణలీలాచారుసౌవర్ణచేలా
నిగమనుతివిశాలానిత్యకారుణ్యశీలా । నగరిపుమణినీలానమ్రసంతానసాలా. 90

గద్య.—ఇది శ్రీమద్భవానీశ్వరశాశ్వత కృపాపాత్ర సహజపాండిత్య మృత్యుంజయనామధేయ ప్రణీతంబైన ధరాత్మజా పరిణయంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

# ధరాత్మజాపరిణయము.

## తృతీయాశ్వాసము.

* * * * *

లయగ్రాహి.

అంతటవసంతమునిరంతరచరన్మకుళదంతురితసర్వహరిదంతము త్రిలోకీ
జంతుసముదాయహృదయాంతరవిహారిరతికాంతమతివేలసురతాంతనమయాలి
శ్రాంతతరుణీతరుణకాంతశయనోచితనితాంతమలయానిలనిశాంతలతికాగే
హాంతమువియోగిమతికృంతనకరోగ్రపికసంతతికుహూనినదవంతము చెలంగెన్. 1

సీ. కమనీయశాఖాధికతరులకును రాగపల్లవయోగంబు ప్రాప్తమయ్యె
మృదులసత్వగుణైకపదసుమనోరాజితోద్భూతనవరజోయుక్తిఁ జెందెఁ
బంచమసహితమై వరభృతద్విజకోటిపాంథపీడనకునుపక్రమించె
సకలరసజ్ఞాళిసముదయంబతిమాత్రమధుపానవశముచే మదముఁ జెందె
జాతికివిరోధియగుచు వసంతనాముఁ । డైనయన్యాయనృపతి వనాంతభూమి
యావరింపఁగనిటులకృత్యములు సాగెఁ । బ్రజలు రాజానువర్తనపరులుగారె. 2

గీ. అతిశయోదితశీతాతపాదులైన । యలజడులకోర్చి భూమీరుహాగ్రశాఖ
లంటివ్రేలెడుజీర్ణచ్ఛదాభిధాన । మునితతికి మాధవుని రాకముక్తి గలిగె. 3

గీ. మహితవనలక్ష్మిఁ బెండ్లియై మాధవుండు। సరసకిసలయమృష్టభోజనములిడినఁ
బరగెనితరేతరాహ్వానపరిచరత్పి । కద్విజాళికుహూత్తాలకలరవములు. 4

సీ. పున్నాగతరుజాతభూరికోరకజాతవిమలముక్తానికాయములు నెఱపి
నవనవోద్భూతపల్లవలతానిర్నిద్రవిద్రుమవల్లికావితతిఁ జూపి
ప్రసవపుంజనికుంజపరిషక్తమత్తాళికులనీలరత్నరాసులు ఘటించి
సవికాసభాసురచంపకద్రుప్రసూనమనోజ్ఞకనకఖండములమర్చి
విలువవీనికివేఱ్వేఱవివిధతరుణ । జనులయభిమానధనమని సారెసారె
దెలియఁబలికెడుపికకీరకలకలముల । నిపుణతరుఁడైన చైత్రవణిగ్వరుండు. 5

చ. సమయసమాఖ్యుఁడై వెలయుసాయకకారుఁడు పుష్పబాణసం
ఘమువలరాచపెద్దొరకుఁ గానుకఁ దెచ్చిన నాత్మ మెచ్చి రా
గముగలపట్టుపచ్చడముఁ గప్పెనొకోయన నాక్రమించెఁ గుం
కుమసుమకాంతిచే వెలయుకోమలపల్లవజాలమెల్లెడన్. 6

సీ. నవసముద్భూతగంధఫలీచయంబునీరాజనోచితదీపరాజి గాఁగ
మత్తాలిఝంకృతులమ్మహితవృద్ధాంగనారచితమంగళగీతరవము గాఁగఁ
గిసలయగ్రాసకోకిలకుహూరావముల్తతవంశబృందశబ్దములు గాఁగ
నిస్సీమనిస్సరన్నిబిడప్రసవపరాగములు కుంకుమవసంతములు గాఁగ
నవ్యకోరకకీర్ణపున్నాగలతలు । తెలివిముత్తెంపుసరులపందిరులు గాఁగ
నమరెనురుగుణధన్యవన్యావసంత । పరిణయోత్సవసంభ్రమస్ఫురణధరణి. 7

సీ. శమనకాంతాస్తనస్తబకకస్తూరికాశాదపాతంబుపసాదమంది
మలయభూధరదరీమధ్యపాటీరద్రుకుటిలకోటరములఁ గ్రుంగిదూరి
పాండ్యాంగనాకేశపాశాగ్రసంఫుల్లమల్లికాకుసుమదామములఁ జిక్కి
తామ్రపర్ణీనదీతరళసముద్భూతవీచికానిచయంబు వెంటనీఁది
యలసియలసప్రచారుఁడై యనిలుఁడసమ । పుష్పభరవినతోద్యానభూమిజాత
శీతలచ్ఛాయలను జేరి చేరి నిలిచి । విశ్రమమ్ముఁ గాంచెఁ దచ్చైత్రవేళయందు. 8

సీ. వసుధపై నీరీతి వాసంతసమయసామగ్రియగ్రియలక్ష్మినలరుచుండ
సంజాతపాతకపుంజపర్వతవినిర్భేదనకరమహాభిదురపాణి
యభినవస్వర్గలోకాంతరకల్పకవిభవమహోర్జితశుభచరితుఁడు
నిరుపమద్యుతితపోనిధివర్ణనీయప్రకాశితయశుఁడైన కౌశికుండు
బుద్ధిలోనిజేష్టసిద్ధికినిది వేళ । యనుచు నిశ్చయించి యాత్మకార్య
సాధకుండటంచు సమ్మతిఁ దలఁచెను । ధీసమేతు నతనుదీప్తిరాము. 9

చ. తలఁచినవీనవేఁగమునఁ దానరుదెంచినయార్యసన్నుతా
త్యలఘుగుణాభిరాముఁ బ్రమదాహితమానసభీకరాసమా
స్త్రలలితరూపశాలి నిజసూను ననూనవిభాసుఁ గాంచె ని
ర్దళితదురాత్మవైరి విబుధప్రవరుండు కుతూహలంబునన్. 10

గీ. అప్పుడుయథార్హపీఠమునందునుండి। వెలయు నజనందనునిఁ జూచి విబుధలోక
హితముఁ గోరుచు మృదుభాషనిట్టులనియెఁ । గౌశికుండాత్మబుద్ధిప్రకాశితముగ. 11

క. ఓసముదితమార్తాండవి । భాసురహితకార్యమొకటి ప్రస్తుతమయ్యె
న్వాసిగ నీతనుజబలము । చే సాధ్యంబదియు దానిఁ జేయఁగవలయున్. 12

సీ. సుందరామాసూతిసురుచితమోమూర్తి బంధురశౌర్యసుబాహుయుక్తుఁ
డనుదినానస్మసన్మహాహవరుణమ్మహోబ్రస్రవర్షిప్రభాకరుఁడు దైత్యప్రభుండు
సకలదేవమునీంద్రసంజనితక్రోధితారకుండనతారిదారకుండు
సతతమాయాతివంచితదేవయోధాగ్రసరుఁడు సాధూత్పలక్షరకరుండు

వానినణఁగింపనేర్చుభవత్తనూజుశౌర్యమటుగాననీమానసంబునందు
నఁదియంబింతవలవదానందమహిమ । ననుమతింపుముతత్క్రమంబవధరించి. 13

ఉ. ఆగ్రహబుద్ధిచేతవిషయంబులశేషముగాజయించిలో
కాగ్రియబాహుశౌర్యగతియాగవిహింసకుఁడైతనర్చున
య్యుగ్రునిమీదశాతశరమొక్కటిబ్రేయఁగసమ్మతింపుమా
నిగ్రహభూతవైరిగణనీదగుపట్టినకార్యసిద్ధికిన్. 14

చ. అనిననసాధ్యమిప్పనియటంచునతండుమదింగలంగినం
గనుఁగొనికౌశికుండపుడుగౌరవవాక్యవిశేషయుక్తులం
దనుఁదెలుపంగనంతనజనందనుఁడప్పనిసమ్మతించెన
య్యనఘునిఁజూచిసర్వవిబుధౌఘములున్ముదమందిరెంతయున్. 15

క. ఊరీకృతకార్యుండై । పూరితహర్షమునరాజుపొదలుచుఁదన్నుం
గారవముచేసియనుపను । దారమనోవృత్తిగాధియాత్మజుఁడరిగెన్. 16

సీ. అంచితస్నేహరసానుభావాన్వితరామానుయానాభిరాముఁడగుచుఁ
దనుఁగనుఁగొన్నట్టితత్పురోత్తమనిషద్యావిద్యమానులౌనిఖిలజనుల
నభివాదనముసేయనానందచిత్తుఁడైవారియర్ఘ్యంబుగారవించి
యచ్చోటువాసియోగారూఢతరగతివిభ్రమాతిక్రాంతవివిధవిషయ
రాజిమన్మథుఁడత్యుదారస్వధర్మ । నిర్జితాద్భుతసామర్థ్యనిశ్చలర్షి
రాజకులమౌనిగాఢస్వతేజమునకు । నఖిలజనములునరుదందనరుగఁదొడఁగె. 17

సీ. ఆరీతినరుగుచునతికీర్తికాముండుమహనీయకాంతారమహిమహర్షి
వికసితస్వాంతుఁడైవిస్ఫుటరుచిబలాతిబలోపదేశప్రదీపితసుమ
నోజాతసౌందర్యసుతవిలాసోదయశాంతాధ్వగక్రాంతిసమధికగతి
పున్నాగరాణ్ణందనోన్నతిఁగనుఁగొనిమఱియునునానందమగ్నుఁడగుచు
నమ్మహానుభావుఁడావేళప్రియరామ । సస్మితాస్యవారిజంబుఁజూచి
యాదరంబుతోడనాయాయువనజాత । భూమిజాతలక్ష్మిఁబొగడఁదొడఁగె. 18

శా. ప్రోద్యజ్జాలకజాలకాన్వితములైపున్నాగభూజాతముల్
మాద్యద్దైవతదైత్యనిర్మథితశుంభద్దుగ్ధపాథోధిరా
ట్సద్యోనిర్గతదుగ్ధబిందుపటలీసంకీర్ణకల్పద్రుమ
ప్రద్యోతంబునఁజెల్వుమీఱెడుఁగదన్ రామానిరీక్షించితే. 19

క. సముదీర్ణపవనవశమున । నమనోన్నమనములఁజెందునవతరుశాఖా

నముదయమూర్ఛనతి । క్రమములఁగనుపట్టెనిపుడుగంటివె రామా. 20

గీ. సాంద్రరోలంబమాలికాశ్రయములైన । సరసలతికానికుంజపుంజములుగంటె
భూరిరుద్రాక్షమాలికాభూషితప్ర । సిద్ధసిద్ధనికాయంబు చెలువుఁదాల్చె. 21

చ. కిసలయలక్ష్మియగ్రమునఁగీల్కొనసంతతజాతనూతన
ప్రసవభరంబుచేతఁగనుపట్టురసాలము నీవు చూచితే
విస్మరదక్షిణశ్వసనవేపితమై మదనామితాశుగ
ప్రసరణకంపమానుఁడగుపావకనేత్రువిధంబుఁజూపెడున్. 22

గీ. ఓయనఘరూపసహితస్వకాయకాము । దేవవిహరణరుచిరమీదివ్యవనము
పూర్వమేతద్విలాసంబుపొగడవశమె । సంతతోన్నతిమనోమోదజనకమరయ. 23

గీ. ఉగ్రుఁడిచటఁదపోవృత్తినున్నఁగెలువ । శక్యమనివారితముగానిచలమునఁజని
ధీరులనలంచునాయతిదీప్తియైన । పంచశరియతనుత్వంబుఁగాంచెఁగాదె. 24

వ. అనిపల్కుచుఁ గతిపయయోజనదూరంబతిక్రమించి యొక్కవిజనప్రదేశంబుఁగని
యిట్లనియె. 25

గీ. విమలచరితసుందరమణీనివాసమీ । యురునగాఢ్యదుర్గధరణి దెలియ
దానవిలసితబహుతరగజముఖ్యస । త్త్వైకవసతియగుటనన్యజనము. 26

గీ. తేఱిచూడంగవెఱతురీఘోరవనము । గాననక్షుణ్ణపథమైయనూననినద
భల్లభల్లూకఝిల్లికాప్రకటకటుత । రార్భటీఘోషితంబయ్యెననుదినంబు. 27

మ. అకలంకోదితసాహసానుపమచర్యన్ దానినాగేంద్రస
త్త్వకనిర్భేదము సేసియుగ్రతరయుద్ధక్రీడనిస్స్వాధ్వసా
ధికపుంస్కేసరికోటిసన్నుతసుశక్తిన్నామసత్కీర్తిమౌ
క్తికముల్వెల్లుగఁజల్లుసర్వదిశలంగీర్ణంబుగానియ్యెడన్. 28

సీ. అనవరగుణశాలియైనరామాకృతిమాధవుండనలోపమానతీవ్ర
శక్తిమదంబకసముదయవిస్ఫూర్తి నెఱపినఁబలుమారునిజశరీర
పారవశ్యముఁజెందిప్రకటితప్రౌఢిమదాటకవనజంతుకోటియెల్ల
నద్భుతగతిమీఱనభినవసురతాప్తినిరతిశయానందనిశ్చలాను
భవమువహియించెనీక్షించుబ్రహ్మముఖ్యు । దివిజవరులునుదత్సుఖాధిక్యమునకు
నాత్మనువ్విళులూరిరత్యంతవాంఛ । భువనములయందునదిగదాపుణ్యఫలము. 29

గీ. శ్యామభవదంబకప్రసారముననుదిత । పంకజాతస్వరూపమైపఱగనిమ్మ
హావనక్షోణియనివర్తితానుమోద । మహిమఁగనుమునికామసామగ్రిమీఱె. 30

గీ. ఒనరరతితోడనీరీతిననుచుఘనకు । తూహలమువొంగనొకకొంతదూరమరిగి
యలరురామాస్యవారిజంబపుడుచూచి । యంతనను మోదభరితుఁడై యమ్మహుండు. 31

గీ. నవ్యశక్తిమదనశ్రీదానంబుఁజేసి । రామహృదయంబుఁజెలఁగించెగామనోజ్ఞ
మహానిరూఢాత్మవృత్తిసమగ్రతర్ష । మహిమవిరహిమహాబుద్ధిమాధవుండు. 32

సీ. అంతరూఢప్రమదాకృతులౌటచేనగణితశోభనమ్మగురుదిష్ట
వశపరిప్రాప్తానవద్యవిలాసమైకనుపట్టువనభూమిఁగాంచివికచ
రుచిమదంబకములరూఢినప్పుడుదితగ్లానులైపథికులసూనమాన
సామోదయుక్తిచేనరుగుదురీమొడననివచియించుచునచటఁగడచి
మఱియుఁదదుపరిమార్గనమగ్రశైల । కాననోదారవృక్షలతానికుంజ
వారములుసూచుచునుగొంతదూరమరుగఁ । బావనాశ్రమమొకటిదృక్పర్వమైన. 33

క. ఈమహనీయతరాశ్రమ । మేమునియావాసమనుచుహృదయంబలరన్
రామాచరితప్రశ్నుండైమునిహృద్రాగకారియపుడిట్లనియెన్. 34

గీ. అఖిలలోకైకవిభుఁడుమాప్రాణభర్త । యానివర్ణితఘనతపోమహిమమునస
మస్తదివిజులునీక్షించి హర్షమంద । నిచ్చటవసించినాడుసమిద్ధచరిత. 35

క. అద్ధన్యుండిచటుఁదప । స్సిద్ధిన్ఘనుఁడగుచువెలుఁగఁజిరకాలంబున్
సిద్ధసమాఖ్యధరిత్రిఁబ్ర । సిద్ధిగనీయాశ్రమంబుచెలువువహించెన్. 36

గీ. దివ్యవైభవోన్నతిమదాశ్రమంబిది । యిచటనేకదాయహీనయాగ
హరినిబిడమానసారంభబలముజే । తవ్యమగునుమనకుభవ్యులార. 37

గీ. జలజలోచనవృషజననియిచ్చటనుమా । ధవుఁసేవసమ్మదమునఁజేయని
ప్రాపితాఖిలేష్టఫలయయ్యెనిమ్మహా । జగతివినుతిసేయశక్యమగునె. 38

సీ. అనివచియించుచునయ్యాశ్రమముఁజేరఁజనువేళనచ్చటిసద్ద్విజన్మ
చయములాఘనునకుసమ్మతినెదురుగాఁజనుదెంచిప్రస్తుతుల్సల్పునామ
నోజ్ఞభాషణములనూతనశ్రవణపర్వంబు ఘటింపమోదంబుఁజెంది
యాత్మసాధ్యంబైనయీదేవతాకార్య మాచరించుటకుమహాదరంబు
మానసంబునఁబెనఁగొనసమహితధీర । తాత్మశీలంబువర్ణనీయంబుగాఁగ
భవ్యవర్తనమునిశితప్రజ్ఞమీఱ । హృదయజనిరూఢరిపుహారియిట్టులనియె. 39

సీ. సంతతసేవ్యరాస్యకాంతినిర్జితరాజసుందతనయునినమందబుద్ధి
హతసర్వవిషయసదాహితాహీనాంగదసుబాహుకలితునుదగ్రపావ
కభయంకరాంబకుఁగ్రతువిఘ్నకరునుగ్రునసమసాయకసముల్లసనశక్తిఁ
బ్రకటంబుగాగెల్చితై్రలోక్యవర్ణితపౌరిఁధినావిబుధరాట్పుత్రిస్తుతేష్ట

కార్యమించు కైనఁగడమ లేకుండఁగ । నలుపవలయు నన్నసంఖ్యశూరు
లభినుతింపననుచు నతులితోత్సాహయో । గము వహించె నాయసమశరుండు. 40

ఉ. ఆమునిమాననీయతరుఁడగ్ర్యవిభావిభవుండు ధీరతన్
హేమగిరీంద్రధర్ముఁడు నిజేష్టసదీక్షతనున్నవేళని
త్యామితకీర్తి కాముఁడు మహామతి రాముఁడు దారచాపవి
ద్యామహితుండు దానవజయంబునకుద్యతుఁడయ్యె నయ్యెడన్. 41

గీ. అస్త్రవర్షంబు గురిసె సమగ్రదర్ప । కక్రియాసాహసోదితాఘురతిఖంజ
రీటభాసురనేత్రాశుస్పష్టమగుచు । నమరవీరులు భయమందిరట్టివేళ. 42

మత్తకోకిల. పాపవాదిసురప్రియంకరవర్తనుండతఁడల్కతో
నాసురాగ్రణిమీద ఘోరతరాశుగాంబకముగ్రుఁడై
డాసియేసినఁ జిత్తమెంతయు డయ్యె నయ్యతిశూరుఁడా
యాసమందెను దేవబృందములందఱున్ముదమందఁగన్. 43

గీ. అమ్మహారాతియీరీతినలజడిపడి । మగుడితత్కాండరయజాయమానవిపుల
మన్యుయుక్తనదీనుఁడై మానసమున । నయ్యనమసాయకుఁడజేయుఁడని తలంచె. 44

క. అనిమిత్తకమయికలుగునె । యనఘునకున్నాకునిట్టియాత్మచలనమే
యనువునదీనికిహేతువుఁ । గనుఁగొననొండేదితనుజకర్మముకన్నన్. 45

గీ. అనుచుఁదలపోసి కదనరంగాహతారి । భీముఁడతఁడు నిజాధికప్రేక్షచేత
నమరవరులు మహాదరంబందిచూడ । నక్షణంబున హృతదర్పకాత్ముఁడయ్యె. 46

ఉత్సాహ.

సురనరాదిలోకములను సూనరచితధర్ముఁడై
తిరుగుశూరునిన్సబాహుదివ్యవిక్రమోదయుం
దరుణరాజమౌళిగెల్చెఁదనమహాంబకంబుచే
గరిమననిసురౌఘమపుడుగాంచెనద్భుతోన్నతిన్. 47

సీ. విదళితఘనపాపవృత్తి విశ్వామిత్రుఁడచలధర్ముఁడవార్యమయినయాత్మ
మన్యువంతయునునమాపనంబొనరించియంతఁబ్రసన్నచిత్తాబ్జుఁడగుచు
నిర్మలాత్మారామధర్మసుధీభవన్మహిమచే మునిలోకబహుమతాధ్వ
రాజితయోగమీరోజనేతత్సమయావధిన్మైసాగెనౌమనమిఁక
రాగంబువహించియుచురహానుదంచితపుణ్యజనకగృహస్థప్రశంసనీయ
శివకరోదగ్రధర్మవిశేషధర్మ । నామితోత్కంఠఁజనఁదగునామహీభృ
దుత్తమనివాసమునకనిచిత్తమలరఁ । గదలెవృషభుఖ్యులైనయాఘనులతోడ. 48

సీ. అంతటనతనుకృతానసమాస్త్రభవప్రతాపవేగదరధూతనగజాత
బాలార్కకిరణసంప్రాపితవ్యాకోచభావవిభాసురపద్మగంధి
లసదానుకూల్యసంలక్షితదక్షిణపావనచర్యయుద్భటమహాత
పమునందునగణితశ్రమసంప్రమోదంబుగావించినన్మార్గగతిఁజెలంగ
వారలనుప్రభూతవారిరుహోపమ । భవ్యముఖులఁజేసెదివ్యవరులు
గోరుచుండిరధికకుతుకంబులలరఁద । త్కార్యసిద్ధిహృదయకమలములను. 49

గీ. అపుడుదీర్ణమానసానందజననియ । స్తోకమార్దవనిజసూక్తి వెలయఁ
జారుబుద్ధిగాధిజనిమహీభృత్సూతిఁ । గాంచియిట్టులనియెఁగరుణతోడ. 50

క. ఓపరమపుణ్యనిరతో । ద్దీపితమణిఖచితహర్మ్యదేశక్రీడా
నైపుణ్యముగాకమహా । తాపసలోకానువృత్తితగునానీకున్. 51

గీ. అనుచునుపలాలనోక్తులనాదరించి । యమ్మహోదారమతిమందహాససుంద
రంబయినరామచంద్రాననంబుఁజూచి । తెలియనిటువల్కెనగ్రభూతలముఁజూపి. 52

సీ. ఓధరేశతనూజయుగ్రతపోవ్రతుల్వరియింతురిచ్చోటసాధుజనులు
మునులసమానకీర్తినితాంతభూషితకుశసంతతిక్రాంతకుతలమీయ
హీనాటవీదేశమేతదగ్రమునందుఁగల్లోలజాలసంఘట్టనప్ర
భూతశీకరజాతభూరిసంబంధబంధురశితవాతవిస్ఫురితమగుచు
నలరుగంగామహానదియరయనిచట । నుగ్రమైనతపోవ్రతయుక్తినుండ
బహుతరాయాసమసుఖంబుప్రాప్తమగును । వలదలిసమాశ్రితాబ్జాతలలితనయన. 53

సీ. అనివారితముగానియాత్మజనిశ్చయమంగీకృతముఁజేసియంతమేన
హర్షసూచకపులకావళిజనియింపముమ్మరంబైనట్టిమోహయుక్తిఁ
జననిగూఢజ్ఞానసంగతివహియించియలఘుశీతాతపాదులకునోర్చి
దుర్గభూస్థలమునందునిషణ్ణయైయీశ్వరునిపాదములయందుమనమునిల్పి
మౌనిసంతతిసంస్తుత్యమహిమఁజెంది । తపముసేయుచునుండెనుదారచరిత
ప్రమదమమరంగవీక్షించుబ్రహ్మముఖ్య । సురలునెంతయునాశ్చర్యభరితులుగను. 54

సీ. అపుడీక్రియధరేశ్వరాత్మజహర్షంబుకొనసాగమౌనిసంస్తుత్యమగుప
థంబవలంబించితనచిత్రకథలెల్లరకుశ్రవణైకపర్వములుగాఁగ
నాయాసమెడలియేయంతరాయములేకయాయాయిఘనవిషయములఁగడచి
పతిమహాశాపవిద్ధతిఁజేసిదేహసౌఖ్యముమానిసుస్థిరగ్రావరీతి
సుందరీమణినిజగుణస్తుతికృదమర । బృందఖేచరమునిశతానందజనని
యున్నతరుచిరసర్వలోకోత్తరప్ర । శస్తరూపతపోవనాశ్రమముఁగనియె. 55

సీ. వర్ణనీయాకారవర్ణియై విలసిల్లు తరుణరాజశిఖావతంసుఁ డంతఁ
దత్తపోవనమహీతలముఁ బ్రవేశించి కనియె నభ్యంగసంస్కారరహిత
బద్ధదుర్భరజటాభారశిరోజాత నతిమలీమసవల్కలాజినవృత
ననశనాతికృశాంగి నవిరతమౌనతత్పర నన్యజనలోకదురవలోకఁ
బతిసమాగమలాలసఁ బరవశాత్మ । నార్యఁ బ్రియభర్తృకోపరుద్ధాక్షచరణ
నిజవధూటిఁ దపస్విని నిబిడమైన । యద్భుతరసంబు మదిలోన నావహిలఁగ. 56

వ. ఇట్లు గనుంగొని సర్వజ్ఞుండయ్యు నెఱుంగని విధంబునఁ దత్తపోనిధిపరిజనులం జూచి యిట్లనియె. 57

ఉ. ఈయలివేణి యీయబల యీలలితాసుకుమారదేహ యీ
కాయజదివ్యసాయకవికాసిత యీమృగనేత్ర యీజగ
ద్గేయగుణాఢ్య యీతరుణి కేవలకామిని గాదు చూడఁ దా
నీయటవీప్రదేశమున నేమినిమిత్తముగా వసించెనో. 58

సీ. అలిజాలనీలకుంతలకింత యర్హమే బంధురారుణజటాబంధనంబు
రాకేందుసదృశాననాకారకుచితమే ఫాలస్థలీన్యస్తభసితరేఖ
వరలతామృదులతావతికింత యుక్తమే కఠినాతిమలినవల్కలపటంబు
పల్లవమృదుపాదపద్మకు యోగ్యమే విపులకాంతారభూవిహరణంబు
తగునె యారూఢయౌవనౌదార్యవతికి । నెరయ నిఖిలేంద్రియగ్రామనిగ్రహంబు
జగతి నుచితానుచితవివేచనము లేని । దైవము మనంబు పరమనిర్దయము గాక. 59

చ. అరుణజటాభరంబు మెయి నద్భుతకాంతి వహించుచుండ నీ
తరుణి నిసర్గమందహసితస్ఫురితాస్యము చూడ నయ్యెడుం
బరిగతసాంధ్యరాగపరభాగపయోదసమీపపూర్ణిమా
సరసిజవైరిబింబరుచిసంతతి నింత తృణీకరించుచున్. 60

సీ. భ్రమియింపకుండునే భ్రమరకదంబము ల్కలికి యాననపద్మగంధములకు
వాంఛింపకుండునే వరకీరనికరము ల్పృథులరాగాధరబింబమునకుఁ
బఱతేరకుండునే పరభృత్వ్రాతము ల్కరపల్లవద్వయాగ్రసనమునకు
నలుగక యుండునే హర్యక్షములు చేరి పృథుపయోధరకుంభజృంభమునకు
గంధదంతావళంబులు గదియకున్నె । యూరురంభాతరుస్తంభయుగళమునకుఁ
దలఁచి చూడఁ బ్రియానమగ్గలము గాదె । వామలోచనకిమ్మహావనమునందు. 61

వ. అని యీక్రమంబున నమ్మహానుభావుండు మహాశ్చర్యకరుణారసంబులు మనంబు
నం బెనఁగొనుచుండ సమీపవిద్వాదాళి కర్ణరసాయనమాధుర్యధుర్యంబుగ నమ్మని

వర్ణితచరిత్రుండగు వర్ణితోనిట్లనియె. ౬౨

సీ. కమనీయగుణరాజి గౌరిసమాఖ్యచేఁ బరగునీజలజాక్షి పరమసాధ్వి
ఘనతపోనిష్ఠచేఁ గాలయాపన సేయునీశునిఁ జేరియ నేకదినము
లుపచారములు సేయుచున్నచో నొక్కనాఁ డాదేవపతిసాయకౌఘ మేయ
శంబరహరు నెడశాంతివహింప కావేళఁ గాంతరతీశవిగ్రహంబు
వేఁగఁగఁగడ తేర్చె నినవనీవిపులనయన । ఖ్యాతివహియించి మిపులఁదద్భామపతిన
మాగమముఁ గాంచి సుఖియింప నన్యయుక్తిఁ । గనక తాపసహితవృత్తిఁ గాంచె నబల. ౬౩

సీ. అనవరవాక్చతురాస్యుండు వటురూపి యధిక తేజోయుక్తి నక్షపాదుఁ
డాత్మేశుఁ డంతఁ గాంతాభ్యర్ణమునకుఁ జయ్యనఁ జేరి నిల్చి తదాశయంబు
నిశ్చయంబుగఁ గాంచి నిబిడమహాదంభ మన్యువు మదిలోన మల్లడిఁ గొన
నిటువలెన్నో కాంత యీవతిమౌగ్ధ్యయోగమునఁ బూనితిఁ గాని కానిపనికి
నాతతవ్యపాశ్వసద్రతి చేతనీవ । మగ్రిగుణములు విఫలంబులయ్యెఁ గాదె
యబ్జగర్భునిబ్రాత యెట్లట్ల కాక । వేఱు సేయంగవశమె యెవ్వారికైన. 64

క. అక్షయసౌందర్యకళా । లక్షితుఁడని తలఁచి తేని లలనా బహుసం
ఖ్యాక్షివికారము చేతనె । సాక్షాత్కృతమయ్యె నతని సౌష్టవమెల్లన్. 65

గీ. అతనిదుర్గుణంబులగణేయములు దర్త్ప । చింత నేమిఫలము సెందు నీకు
వినుతరూపశాలి ననుమానియక టనీ । వన్యరతికి నెట్టులానపడితి. 66

సీ. నీదుదుర్బుద్ధికి నేది మేరతలంప ననినవగాఢసమగ్రరోష
రసయుక్తి సంజాతవిస్మరానలభావసతితపస్విని గాఢసంభ్రమమున
నధికరక్తిమయుక్తి నక్షియుగ్మంబరుణాబ్జపత్రచ్ఛాయ నవఘళింప
నాకాంతగుణనిధి నపుడు నిరీక్షించి భాసురమూర్తి మత్ప్రాణభర్త
ననుగణన సేయకీవిటు జనితరాగ । మతివహించుట దుర్వచోర్జితమహోగ్ర
పాతకము నీకవశ్యంబు ప్రాప్తమయ్యెఁ । గాన వేఁగంబులభియించు దానిఫలము. 67

క. అనశనకృశదేహముచే । నిను నెవ్వరుగానకుండ నిర్జనవనభూ
మి నిదపియింపందగునీ । ఘనకలుషమశేషమగు చుఁగడచను దాఁకన్. 68

సీ. అని బహుపరుషోక్తులాడి తపోనిధి సనయతత్త్వము చూపి చాలఁగాల
యాపనఁ గావించియలయకకని దీన ననివార్యమగు నీదు రాత్మయుక్తి
యనియున్న మితసూక్తి ననుదయామతిఁ గావు దుర్యోగపాపంబుఁ దొలఁగఁ జేయు
శరణాగతానేక సాధుసంరక్షాక్రియావిచక్షణ సంగరాభిరామ
భద్రగుణరత్నసాగర పరమపురుష । రాజశేఖర సన్ముని రాజవినుత

యనఘచారిత్రయనుచునాయమగుణనిధి । పలుకునతఁడునుగారుణ్యకలితుఁడగుచు.

క. జలజాసనాదినిర్జర । కులసామ్రాజ్యప్రదానకుశలకటాక్షాం
చలములదిక్కులువెలుఁగఁగ । జలజాయతలోచనుఁడుప్రసన్నుండయ్యెన్. 69

సీ. పరమకృపాపూర్ణభాస్వదబ్జశుచివిలాసవల్లోచనలక్ష్మితోడ
నధికరత్నచయప్రభాభిరామాహీనకర్ణకుండలయుగ్మకాంతితోడ
రమ్యహరిగ్రావరాజరాజత్కాంతికమనీయదివ్యవిగ్రహముతోడ
శతకోటిమదనలజ్జాకరలావణ్యకలితసౌందర్యలక్షణముతోడ
వివిధమునిగణనాథపుంగవసహాయుఁ । డగుచుఁబ్రత్యక్షమైనరాజావతంసుఁ
గాంచియాశ్చర్యలజ్జాధికప్రమోద । గరిమలాత్మనుబెనఁగొనఁగాంతనిలిచె. 70

సీ. అతివేలజనితహర్షాబ్ధిలోపలఁదేలిస్వాంతంబుపారవశ్యమువహింప
గాఢోద్గతంబులైగల్లభాగములందుఁబులకాంకురంబులబ్బురముగాఁగ
వికచాబ్జదళకాంతివిహసింపఁగాఁజాలుకన్నులానందాశ్రుకణములీన
మలయానిలాధూతమల్లికాలతరీతిఁదనువుమనాగ్వేపితంబుగాఁగ
నతులితాత్మీయభాగ్యసామర్థ్యమునకుఁ । దన్మనఃప్రియజాతవాత్సల్యమునకు
నద్భుతానందములుడెంచమలముకొనఁగ । నప్పరమపూరుషునినిట్టులనినుతించె. 71

ఆ. పరమపురుషయీశభవబంధమోచన । దీనసదయహృదయదేవదేవ
నీపదాబ్జయుగళినేనిదేపొడగంటిఁ । గలుషసాగరంబుగడువఁగంటి. 72

సీ. సకలయోగిస్వాంతసంతతాశ్రితచిదానందసదావందనంబునీకు
లోలదానవజాలచాలనత్రైలోక్యపాలనాదరమోప్పుఁగేలునీకుఁ
జండారిఖండనాఖండపాండిత్యభండనమహోద్దండదండంబునీకు
నారూఢమునిమనోనీరజాతాంతర్విహారిపాదాబ్జజోహారునీకు
ధిక్కృతాశేషకల్మషమ్రొక్కునీకుఁ । జరణసన్నుతచతురాస్యశరణునీకు
నతసురాఢ్యనమస్కరణంబునీకు । మానితాశ్రితజనప్రణామంబునీకు. 73

సీ. నీమాయఁగడతేఱనేర్తురెబ్రహ్మాదిదివిజప్రవరులైనదేవదేవ
నీరూపమిదియనినిర్ణయింపవశంబెవేదాంతములకైనవేదవేద్య
నీసద్గుణంబులెన్నినుతింపశక్యంబెఫణిపుంగవునకైనఁబరమపురుష
నీదివ్యరుచితోడసాదృశ్యమమరునెరవికోటులకునైనభువనవినుత
నీమహత్త్వంబుఁదలపోయనీకకాక । యితరజనులకుశక్యమెశ్రితనికాయ
వినుతచారిత్రగర్వాంధవిమతజైత్ర । భక్తసజ్జనమందారభవవిదూర. 74

## దండకము.

శ్రీమత్కృపాపూరితాలోక, లోకత్రయత్రాణదీక్షానదీక్షామహాపాంగ, యోగాగామితానంద లీలాసుధాపూర వారాశికల్లోల డోలాముహుః ఖేలనాముఖ్య సాఖ్యానుసంధానవన్మానిని చేతస్సరోహంస, హంసాగ్నికోటిప్రతీకాశ దివ్యప్రభాభాసమానాంగ, యంగీకృతాశేష భక్తౌఘసంరక్ష, రక్షోమహాసైన్య వన్యాసముజ్జృంభ సంస్తంభనోద్వేలకీలాకులాభీల దావానలాభోగ, భోగీశ వాగీశ ముఖ్యామర ప్రౌఢ వాగార్భటీ నిర్భరస్తోత్ర పాత్రీకృతానంత కల్యాణ చారిత్ర కల్పద్రు సంతాన మందార ముఖ్యామరక్ష్మారుహశ్రేణికా సారభోద్గారి దివ్య ప్రసూనావళీ పూజ్యమానాంఘ్రిసీరేజగర్భోపి నిర్భేదవాదేష్వవాదేషు వేదేషు విజ్ఞాన నేత్రేణ చిత్రేణ సంమృగ్య సంసార ఘోరాట వీపావకం తావ కంత త్వమాద్యం పరంవేదితుం నాలమిత్యాలపంతి ప్రభో పండితాః ఖండితాశేష దైతేయమాయాంధకారేణ సంమోహినాం దేహినాం జ్ఞానచక్షుః పిధాయత్వమేకో మనోవాగమే యేపదే వర్తసే కేచనాధీతవేదామహీ నిర్జరాదుర్జరాశావశీభూత చిత్తాఃప్రమత్తాః కుశీలావిలోలాస్సదావార్య మన్యోన్య మాత్సర్యమాగత్యషడ్దర్శనీఘోర కాంతార మార్గేషు దుర్గేషు దర్పేణసర్వంత ఇత్థంపరం తత్త్వమేతత్సమీచీనమేవంపురాసూక్తమాత్యైరిదం నేత్యదోనేతి వాక్యైర శక్యైర పిప్రోతు మాముష్టియుద్ధం వదంతో హ్యదంతేషు చింతాః పరాస్సంశయా నాశ్నయానామనోజాత శాతాస్త్ర పాతైరుపే తైర్వినశ్యంతి నిర్ణీయతే తైర్భవానిత్య యచ్చిత్తమోహోమహీచంద్ర వాయ్వగ్ని సూర్యోదకా కాశముఖ్యైస్స్వరూపైస్సదాదృశ్యసే సర్వతోయత్రయత్రైవ చిత్తాస్సరోత్తంస పుంసః పరిక్రీడతే తత్రతత్రైవసంతిష్ఠసేత్వం సదేకంపరంజ్యోతిరప్యాత్మ లీలావశాదేవ, మాయాన్వితస్సన్ గుణం రాజసంతత్సమాశ్రిత్య భూత్వావిరించిస్స దేవం ససిద్ధం ససాధ్యం సగంధర్వవారం సతారం సచంద్రం ససూర్యం సమర్త్యం సనాగం సశైలం సవృక్షంసతిర్యంచమేతత్ప్రపంచం భవాన్ కల్పసేదేవ, సత్వాభిధానంగుణం సంశ్రితో విష్ణురూపేణ దోర్గర్వదుర్వార దైతేయజాతాని జిత్వా దయాలోకనైః పాలయన్ వర్తసేత్వంప్రభో, బ్రహ్మ కల్పావసానే సమస్తప్రపంచం విలాసేనసంస్తుత్య నిత్యామితానంద లీలాప్రచండే మహాతాండవేపండితో భూవిభూతిం త్వదీయాంవివేక్తుంక ఈశీతదేవ, త్వమర్కస్త్వమిందుస్త్వముర్వీత్వమేవానిలస్త్వంవియత్త్వందిశస్త్వందిశాంపాలకాస్త్వం గ్రహాస్తారకాస్త్వం చశైలాస్సముద్రాః ఫణీంద్రానరేంద్రాశ్చవేదాస్త్వ మోంకారరూపస్త్వమీశానభావ త్వదంశంవినాభూతమేతత్ప్రపంచంనకించిత్పదార్థం నజానామినిత్యం, భవన్మాయయాహ్యద్వచోమేయ యాతీవమూఢానిగూఢాత్మ విద్యా అమీజంతవః కింతవా. రాధ

నే మోక్షలక్ష్మీసమహాసాధనే శక్తిమంతో భ్రమంతోఽపి సంసారకూపే మహాపాపరూపే జనా యే భవద్దివ్య గేహోత్తమ ప్రాంగణే యేన సంస్తుత్య నృత్యం కృతం దివ్యభోగానుపే తస్య తస్యాగ్రతో మేనకాముఖ్య దివ్యాప్సరో భామినీభిస్సదా నృత్యతే ఏనవా దారు పాషాణజాతేన తే మందిరం నిర్మితం తేన కల్పద్రుమోద్యాన మధ్యంన మధ్యాసితం కాంతచింతామణీ రత్నగేహేషు యేనోత్తమైస్స్వైరభావాన నానా ప్రసూనైర్భవత్పాద పద్మద్వయం పూజితం తేన మాహేంద్ర భోగోఽపి నో గణ్యతే యేన వా దివ్య మంత్రస్త్వదీయో మహాసిద్ధ భూమీషు నిత్యాప్రమత్తేన చిత్తేన జంజప్యతే దీప్యతే తేన సర్వాతిశాయిత్వ భాగ్యత్వయే నాకృతిస్తే సదా ధ్యాయతే నిశ్చలం తస్య ముక్తిః కరే సంస్థితా దేవ దేహే పురా జన్మకోటీషు దుష్కర్మణాం వాసనాభిర్నిబద్ధో విబుద్ధిస్స్వతంత్రేణ తే దివ్యపాదాబ్జ పూజాదిసత్కర్మకృత్వా భవద్దివ్య లోకం ప్రయాతీతి మిథ్యా మహాకర్మ దుర్వాసనా యోజనో నిత్యనిర్హేతు కారుణ్య భాజా త్వయా సత్కృపాలేశవద్దివ్య దృష్ట్యా సమాలోక్యతే సద్రుతం విద్రుతాశేష దోషోదయ స్స్వాత్మవిజ్ఞానవాన్ జాయతే యస్త్వదీయానుకంపాసుధాబిందులేశేన హీనస్స దుర్వారసంసారవారాశి మధ్యే పరిభ్రాంతిమాపద్యతే విద్యతే యస్య చిత్తే భవత్పాద భక్తిస్సదా తస్య భాగ్యోదయో బ్రహ్మశక్రాది దేవోత్తమైః కాంక్ష్యతే ఘోరపాపావళీ మత్తమాతంగ సంఘాత భీతిప్రదోదగ్ర కంఠీరవోత్తంసగర్జాయితం తావకం నామ నో జప్యతే వాగ్వతా యేన వా తావకీనాకృతిర్జాతు నాలోక్యతే న ధ్రువం నేత్రవానప్యహో కాణతామేతి యేనాతి సౌభాగ్యసంధాన దివ్యప్రథా తే కథా నైవ కర్ణాంతరం ప్రాప్యతే దేవ శ్రుణ్వన్ సదా బాధిర్యమాపద్యతే చేదసత్యం నమాసాద్య యస్తావకీనైర్జనైర్నిర్మితాం నేతి తస్మాన్న గోవాప్యగోవా ఖగోవా వరం నిత్యనిర్హేతు కారుణ్య లీలాన్వితత్వం నమస్కృత్య యాచే పునశ్చైవ యాచే భవత్పాదయోర్భక్తి రేవానిశం దీయతామీశ కారుణ్యమూర్తే నమస్తే. 75

క. తరుణియిటు వినుతి సేయఁగ । దరహసితము వదనసీమఁ దళుకొత్తఁగ న
ప్పరమకృపాసాగరుఁడ । ధ్వరహింసాకారిహరుఁడు దానిట్లనియెన్. 76

చ. పరమపతివ్రతామణివి పద్మవిలోచన నీవు నీ గుణో
త్కరముల శేషలోకజన కౌతుకహేతువులింక ఖండిత
స్మరవిశిఖప్రతాప రుచిమద్వరయోగము చేత నిత్యని
ర్భరకుతుకంబుఁ గాంచెదని పల్కు కృపోన్నతిఁ జూచుచుండఁగన్. 77

చ. అమరులు పుష్పవృష్టిఁ గురియన్ మఱియంత విధూతకల్మష
ప్రమదము నీశ్వరుండు గని భాగ్యమనన్ నిజధర్మగేహినీ
ననుచితయోగమబ్బె నని సర్వమునీంద్రులు సంస్తుతింపను

త్తమమతిరామభద్రగుణతత్త్వముఁ దాఁగొనియాడెనెంతయున్. 78

* * * *

గద్య.—ఇది శ్రీమద్భవానీశ్వరశాశ్వత కృపాపాత్ర సహజపాండిత్య మృత్యుంజయనామధేయ ప్రణీతంబైన ధరాత్మజా పరిణయంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

---

# ధరాత్మజాపరిణయము.

---

## చతుర్థాశ్వాసము.

శ్రీవరదానవకార్ముక । సావరవనితానితాంతసంభ్రమవనభూ
షావహానదర్శిగగనచ । రీవర్ణితశంఖరావ శ్రీహరిదేవా. 1

అవధరింపుము.

సీ. అటులుప్రశస్తరామార్యవర్తనుఁడైనసర్వజ్ఞుఁడౌమునిసభ్యసుతుఁడు
సప్రమదుండయిచనియెనాసాధ్వీవతంసంబుపతిప్రసాదంబువడసి
బాలార్కకిరణసంపర్కవన్నవసరోజమురీతిమదివికాసమువహింపఁ
దనసఖీనిచయంబుతన్మహాసౌభాగ్యచర్యకుమిపులనాశ్చర్యమంద
మహితహర్షధరస్వామిగృహమునంద । పూర్వవైఖరిచేమనఃపూర్ణశక్తిఁ
దలఁపుచుండెనునిజవాంఛితప్రదాత । యైనయప్పరమాత్మపదాబ్జయుగము. 2

క. తరుణతరరాజమౌళియు । సరసమనోజయదగాధిజాతాన్వితుఁడై
యరిగెంజిరపుణ్యసము । త్కరజనకక్షితిభృదీశధామంబునకున్. 3

శా. ఆదివ్యప్రభుమానసంబునకునిర్యాతోల్లసత్సౌరభ
శ్రీదోదారపురాంగనాకుచతటీశృంగారకస్తూరికా

శారదాపాత్రగతస్వదాలసచరత్స్వామీరసంయోగమా
పాదించెంబ్రమదంబుభావిశుభసంపత్సూచనాదక్షమై. 4

గీ. అంతనత్యంతసుగుణమహాయశోభి । రామజాయాసమాగమోద్దామజనిత
లాలసమునీశ్వరుఁడుగాంచిలలితకార్య । ఘటనమునకూహఁగావించెనిటులమదిని. 5

సీ. శాంతవర్తనులనశ్రాంతనిశ్చలపరబ్రహ్మానుసంధానపావనులను
గుణశీలమతివయోగుణతపోవృద్ధులఁబరపురుషార్థసంపాదకులను
నపరుషభాషులనపగతద్వేషులరమణీయతేజోభిరామతనుల
నవసుధామధురవాక్యవిశారదులనీతిచతురులనిర్మలాచారపరుల
సత్పథంబునఁజరియించుసాధుమతుల। నతులదాక్షిణ్యాథరులమహర్షివరుల
ననుపఁదగునిటువంటికల్యాణకార్య । ఘటనఁగావించుటకుఁగౌతుకంబుమీఱ. 6

సీ. అనియాత్మలోఁదలంచినశుభఘటనైకవాంఛచేనిజపార్శ్వవర్తులైన
యమ్మహర్షులనతిహర్షులనీక్షించియనఘాత్ములారమీరలఘుపుణ్యా
జనకాచలేశనిశాంతంబునకుఁజనితావకమందిరస్థైర్యకలిత
శైవకాండాసనేక్షాపూర్వకముగనీయాత్మజవరియింపనాత్మఁగోరి
వచ్చుచున్నాఁడుఘనవైభవంబుమీఱఁ । దరుణరాజవతంసుఁడుదారబుద్ధి
రాముఁడనిపల్కిమీరతిరయముచేత । మగుడిరాఁదగునన్ననమ్మౌనివరులు. 7

చ. అటఁజనికాంచిరంతమునులయ్యచలేశనివాసదేశమా
కటకవతంసముంగనకకల్పితసాలశిరఃప్రదేశసం
ఘటితమనోజ్ఞహీరమణికాంతివ్యాపినకాండలాలసా
చటులరయాన్వితానుగతసారనదీఘనరాజహంసముల్. 8

ఉ. అచ్చటనచ్చటన్వెలయునచ్చపుపచ్చలతోరణంబులన్
అచ్చలహెచ్చులైననెలతాలయరుంగులరంగులన్సదా
లచ్చికినాటపట్టయినలచ్చనముల్పరికించిచూచుచో
నొచ్చెములేనియచ్చెరువునొందఁగఁజేసెఁబురంబువారికిన్. 9

చ. కనికొనియాడుచున్మునిశిఖామణుల్ప్రియసమ్మదంబునం
జనిచనికాంచిరంతటవిశాలమణీరచితాగ్రసౌధసం
జనితరుచిప్రరోహముఁబ్రసన్నకృపాపరిపాలితాత్మభూ
జనకధరేశగేహమునుసంగతచారువధూసమూహమున్. 10

వ. మఱియుం దద్భవనంబు, భువనంబుల కుచితంబులుగ రచితంబులైన కనక రంభా
స్తంభంబుల జృంభంబులం గనుపట్టు ప్రతీహార ప్రదేశంబున నానా దేశములనుండి

వచ్చి రాజ దర్శన సమయకాంక్షులై యున్న భూభృత్సేనావితానంబు నిజ కుమారి
యైన వారిజనివాసిని నిసర్గచాపలంబు వర్జించి యద్ధరాధీశుని యింటం దఱలక
యుంటయెఱింగి తదీయ దర్శన లాలన పారవశ్యంబున నరుగుదెంచి యుద్దండదం
డధర పాలితంబైన ద్వారంబుఁ బ్రవేశింప వశంబుగామి నచట నిలిచియున్న వ
యఃపయోరాశిం దలపింప ధర్మ సభాసీనులైన ధర్మాధికారులు గావించు నకలుష
వ్యవహార నిర్ణయంబులకు మెచ్చి వియచ్చరులెడనెడఁ దఱుచుగ హర్షించి వర్షించి
న యమందమందార ప్రసూనంబుల మరందంబు నందంబుగం బానంబు సేయుచు
వెంటనంటి వచ్చిన శిలీముఖంబులు తద్ద్వారగత వేదండ గండస్థల మద సలిల ధా
రాస్వాలోలుదపంబులు గావించుకొను కొఱకుఁ దిరుగుచు నజర బాలక నికురంబ
క్రీడాకందుకీకృతసుందర పురందరమణి నికురుంబంబులలోనం దడంబడి పట్టువడు
చునుండ, రాజగృహనిరంతరాహూయమాన హవీరాస్వాదన చాపలాహంపూర్వి
కాసమాయాత పురుహూత ప్రముఖబర్హిర్ముఖమాళి పారిజాతప్రసూన మాలికా
నిరర్గళగళత్పరాగంబు నెఱపి చోటులనేర్పడినకరార్పణ సమాగత భూభృత్కదం
బచరణ రేఖాపద్మంబులుసూచి యథార్థ పద్మంబుల నిగ్రహింపం బోవు బాలికలం
గనినవ్వు ప్రౌఢ పరిచారికానికాయంబు దశనవిసృమర రోచులసముచంద్రికలనీన,
విరహాశంకావ్యాకులిత హృదయంబులైన ప్రోషితచక్రవాక దంపతులుచూపఱకుఁ
గృపారసంబు జనియింపంజేయ, వాతాయన రంధ్రంబులవలన వెడలు నధివాన ధూ
పధూమంబు లంతఃపురాంగనా నికరంబుల కరంబు లలితంబైన తనులతల ధాగధ
గ్యంబుఁ జూచి సౌదామినీ లతావితానంబులను శంకచేతఁ బంకజాక్షుల గొ
ప్పకప్పుకొప్పుల చాటునంబడి శుద్ధాంతంబుఁ బ్రవేశించి రాజశాసన భయంబున న
చ్చటనిలుకడలేక మగుడఁ దొలంగునీలనీరదంబులను సందేహమాపాదింప సమీపో
ద్యానగత కోకిలంబులు కలకంఠ కలనినాదంబులు విని నిజ బాంధవ మృదు కూ
జితంబులనివచ్చి, పద్మరాగమణికీలితంబులైన మరకత స్తంభంబులుచూచి గాయ
కగానమాధుర్య సుధారస మహిమంబునం బల్లవితంబులైనదారు స్తంభంబులని త
లంచి తత్కిసలయగ్రసనంబు సేయనూహించి చంచూనిపీడన మాత్రఫలంబుఁగని తిరి
గిచనుచుఁ గేవలదంభప్రధానుండైన నృపునడిగి రసనాశ్రమ మాత్రఫలంబుఁగని వె
డలుమార్గణ వర్గంబుం దలపింప నన్యోన్యసంఘర్షణ జనితభూషణ సువర్ణ రజో
రూషితంబులైన యంశుకంబులంగల సకలజనులు తద్ధరాధీశ్వరు విచిత్ర చరిత్రంబు
లువిని యాలోకన కౌతుకంబున నరుగుదెంచిన పీతాంబర సారూప్యధారుల నను
కరింప నాశ్చర్యధుర్యంబైయున్న సన్నుతర్షులై మహర్షులు ద్వారదేశంబుననిలిచి, ద్వా

వారికుల చేతం దమరాక యొఱింగించిన నయ్యచలాధీశ్వరుండును. 11

గీ. అర్ఘ్యపరిచారకులు వెంటనరుగుదేర । నర్ఘ్యపాత్రంబు చేఁబూనియమ్మునులకు
నెదురుగావచ్చి ప్రణమిల్లి హృదయభక్తి । యమరనుచితసువర్ణపీఠములనునిచి. 12

గీ. పూజఁగావించి యిట్లనుఁ బుణ్యధనులు । మీరు నాయింటికిఁ గృపాసమృద్ధిమీఱ
నరుగుదెంచుట బహుజన్మచరితపుణ్య । కర్మచయపరిపాకయోగంబు గాదె. 13

గీ. తొలఁగెదురితంబు మనము నిర్మలతఁ గాంచె । సకలకల్యాణములు వేడుసంభవించె
జన్మసాఫల్యమయ్యె మీచరణయుగళ । కమలములు గాంచుభాగ్యంబు గలిగెఁ గాన. 14

సీ. వ్రతకోటిసుకృతసంతతిసంఘటింపఁగఁ జాలదే సజ్జనసంగమంబు
బహుళతీర్థస్నానఫలము గావింపదే యార్యపాదక్షాళనాంబుకణము
చిరకాలతపముతో సరిఁదూఁగఁగాలేదె పుణ్యపూరుషవర్యపూజనంబు
నిశ్శ్రేయసానందనిర్వాహకము గాదె విబుధకోటికటాక్షవీక్షణంబు
గానమీవంటిఘనులు నిష్కారణముగ । రాజ్యలక్ష్మీమదాంధకారమున మునిఁగి
క్రిందుమీదును గాననిమందమతుల । యిండ్లకేతెంచుట శుభైకహేతువరయ. 15

వ. అని వినయపూర్వక మృదుభాషణంబుల హృదయతోషణంబుఁ గావించుచున్న య
ద్ధరాధీశుతోడ నప్పరమ తపస్వి శిఖామణు లిట్లనిరి. 16

క. సేమమె నీకును, సుతులక । నామయమే, కుశలమే నిజాంతఃపుర నా
రీమణులకు, భద్రమె నీ । భూమీజనములకు, నిఖిలపురవాసులకున్. 17

గీ. అనిన నిఖిలంబు యుష్మదీయానుపమకృ । పానుభావంబు చే శుభంబనుచుఁ బలికె
ముకుళితకరారవిందుఁడై మ్రోలనున్న । యతనిఁ గూర్చుండ నియమించి యాదరమున. 18

సీ. ప్రకటీకృతాత్మప్రభావిభవుఁడు పాదకమలసన్నుతయోని కౌశికుండు
సరసభవత్తనూజాకరగ్రహకామనాపూర్ణమతి రామనామశాలి
రాజమౌళిసహితుఁడై జయభూజనాగ్రసభాజితసుగుణభ్రాజితుండు
నైన నీగృహమునకరుదేర నాత్మలో నిశ్చయంబొనరించి నీకునిట్టి
శుభముఁ దెలుపంగ మముఁ బంపె శుభచరిత్ర । యమ్మహుని చేత నె భవన్మహాక్షయశివ
కరసుధర్మంబు సుగుణవిఖ్యాతిఁ జెందు । నీ ప్రతిజ్ఞయు నీడేరు నిశ్చయంబు. 19

గీ. నీదుహితసాధుమానసనిపుణవృత్తి । నమ్మునీశుండు ఘనకౌతుకంబు గాంచి
కరుణ మీఱంగ నీకు నీకరణిమేలు । సంఘటింపఁగఁ దలఁచెనో సాధుచరిత. 20

క. ఆమంజులకారుణ్యర । సామితవర్షానుతోషితాఖిలజనతా
రామునికన్నఘనుండీ । భూమిత్రిదివాహిలోకములలోఁ గలఁడే. 21

గీ. అనిన నాయనవరకృపాస్వాంతరక్షి । తాత్మమహిజనకుండచలాధినాథుఁ

డమితకుతుకంబుఁ జెందియిట్లనుచుఁ బలికె । నమ్మహర్షులతో వినయంబు మీఱ. 22

క. ఆయనమనోజ్ఞరుచిమద్గృహస్థధర్మ । మున్నతము సేయుకొఱకుఁ బ్రసన్నచిత్తుఁ
డగుచు నంగీకరించిన నతని కేన । మర్పణంబొనరించెద నబ్జముఖిని. 23

గీ. ప్రతినయోడేరుచుండ నప్రతిమసుగుణ । పతిసమాగమమునఁ దనూభవసుకృతము
సఫలముగఁ జేయుకన్న నీజగములందు । మాదృశులకన్యమగు భాగ్యమహిమ గలదె. 24

వ. అనుచు నంతఃపుర కాంతాసమేతుండుగ నమ్మహానుభావుండు తదీయజామాతృభావంబునకు భావంబున నిశ్చయించి వారల బహుమాన పురస్సరంబుగఁ బనిచిన వారలు నయ్యసామాన్య విబుధ మూర్ధన్యుతో నంతయు సవిశేషంబుగ విన్నవించిన నతండును నయ్యచలాధిపతి యింటికరుగ నిశ్చయించి. 25

సీ. అభిరామరూపధరామరవ్రాతంబు జయజయధ్వనులచే సందడింపఁ
బృథులకాహళశంఖభేరీరవంబులు నిఖిలలోకంబు ఘూర్ణిల్లఁ జేయ
సజలజీమూతగర్జాన మహాదరములై సూతమాగధజనస్తుతులు సెలఁగ
విబుధవృద్ధాంగనావిసరంబు లెడనెడ నీరాజనములతోఁ జేరి నిలువ
నఖిలవైభవములమీఱ నద్ధరేశు । నింటికరుదెంచెఁ గల్యాణహేతుకముగ
నపుడు రాజాత్మభవయుతుండగుచు మౌని । దేవవర్ణితవిమలస్వభావిభవుఁడు. 26

ఉ. వచ్చినయమ్మహాత్మునకు వారితకౌతుకసంభ్రమంబులన్
హెచ్చినభక్తిచే నెదుట నేగి నమస్కృతిఁ జేసి నిర్మలో
ద్యచ్చరితార్ఘ్యలౌ తదనుగాంచితలక్షణరాజముఖ్యుల
న్మెచ్చికఁ గౌఁగిలించికొని నైపుణిమీఱఁగఁ బల్కె నీగతిన్. 27

ఉ. ధన్యుఁడనైతిఁ బూర్వసుకృతప్రకరాప్తిని సర్వలోకమా
ర్ధన్యుఁడనైతి సర్వవిబుధప్రికరాఖిలబాంధవాళికి
న్మాన్యుఁడనైతి దేవవరమౌనిజనస్తవనీయనీయసా
మాన్యదయాసుధారసనమగ్రత నాయెడఁ గల్గఁగా పునన్. 28

సీ. ప్రతిసర్గవేళ నాబ్రహ్మదిదివిజసన్నుతుఁడవై సట్టియున్నతుఁడవీవ
రహినచ్యుతాస్త్రధారణముచే దివ్యప్రకాశంబు దాల్చినఘనుఁడవీవ
శ్రీకరద్విజరాజశేఖరత్వముచేఁ బ్రశస్తిఁ జెందినమహోజ్వలుఁడవీవ
కృతులు మెచ్చఁగఁ దృణీకృతకామబలుఁడవై తపమొనర్చినధన్యతరుడవీవ
విదితసత్వజితక్రూరహృదయవైరి । చయుఁడవై విలసిల్లు దుర్జయుఁడవీవ
వర్ధనముఁ జేసి నీప్రభావంబులెన్న । భూరికరుణావిహారయవ్వారితరము. 29

గీ. ఓయశేషవిబుధనాయకకల్మషా । పహమదాత్మజాతమహితభక్తి

నర్ఘ్యపూజనీకునర్పింపఁగలుగుభా। గ్యంబుదొరకెఁగానఘనుఁడనైతి. 30

వ. అని సవినయ మృదు మధుర వచన రచనా ప్రవీణుండగుచు నర్ఘ్య పాద్యాదులం
బహూకరించి విరించి ప్రముఖ నిఖిల గీర్వాణులకు నాశ్చర్యావహంబైన యొక్క
యుపకారికా భవనంబున విడియించి యమ్మఱునాడు. 31

ఉ. కల్యమునంబ్రమోదమధికంబుగనన్నగరోత్తమంబు సా
కల్యముచేనలంకృతముగా నొనరించిధరేశ్వరుండు చాం
చల్యమువాసిచిత్తముప్రసన్నతమీఱఁగనాత్మజన్మసా
ఫల్యత గల్గెనంచుఁ దనభావమునందలపోసియంతటన్. 32

గీ. యాగహారిహరునినానుమనోమౌని। సహితముగనుమంత్రిజనులచేతఁ
బిలువనంపియర్ఘ్యపీఠనమాసీనుఁ। జేసిసభ్యజనులచిత్తమలర. 33

క. వసుధాభృన్నాయకుఁడా। రసికునకునమూల్యరత్నరాజిమొసఁగిస
ర్వసభాసదులకువెలుఁగగు। నసమాత్మగిరీశధర్మమప్పుడుచూపెన్. 34

గీ. అంతనారాజమౌళియుదగ్రబుద్ధి। చాపలతభంగమొనరించిచతురుఁడగుచుఁ
బూజఁగావించునచలేశుపూర్ణమైన। యాదరంబునకునుమెచ్చెనాత్మలోన. 35

ఉ. ధీయుతలైనయట్టిసుదతీమణులందఱునోధరాత్మజా
నీయధినాథునేమనిగణింపఁగవచ్చునవాభ్రికేశుఁడీ
కాయజభూతియుక్తుఁడుమఘప్రతికూలసురారిహారియో
తోయజనేత్రయంచుమృదుస్థితిచేఁదెలియంగఁబల్కిరన్. 36

క. కేళీహర్మ్యనిజాళీ। పాళీగదితాత్మరమణబహుసంశ్లాఘా
లోలీకృతహృదయముతో। నాళీకదళాక్షియుండెనమ్రాననయై. 37

గీ. అథరేశ్వరుఁడత్యంతహర్షమహిమ। రాజచూడామణియునుసర్వజ్ఞమూర్తి
యతిబలోద్ధతవైరిపురాంతకుండు। తనకుజామాతయగుటకుఁదనరిపొంగె. 38

ఉ. అంతటనాత్మజాపరిణయస్థిరనిశ్చయుఁడాధరేశ్వరుం
డంతరుదీర్ణహర్షభరుఁడైయజనందనుఁబిల్వఁబంపియ
త్యంతకుతూహలాఢ్యుఁడగునాయనదానునునన్ముహూర్తము
న్నంతనమొప్పఁజూచెబుధసంతతులెల్లనుసమ్మతింపఁగన్, 39

క. ఆసుముహూర్తమునందు। న్వాసిష్ఠప్రముఖనిఖిలవసుధామరరా
జీసముదితవిదితాశీ। రాసాదితపరమకౌతుకాఢ్యుండగుచున్. 40

క. బృందారకేంద్రనిభుఁడతఁ। డందంబుగనిజపురోహితాదులుచనియా
నందంబుగనున్నశతా। నందునిఁగనియిట్లుపలికెనైపుణిమీఱన్. 41

గీ. ఆదిపూరుషవేదిలోకైకవినుత। భావితాశేషనిగమనిర్ఘోషచరిత
లాలితజ్ఞానవిజ్ఞానలక్షణముల। నిఖిలవిబుధోత్తరుఁడవీవనిశ్చయంబు. 42

సీ. ఈముహూర్తమునందునిర్ధనసద్గుణరత్నఖనిమైనమత్కన్యకాలలామ
ననురూపరూపసామగ్రినగ్రియుఁడైనరాజశేఖరునకర్పణము సేయ
వలయునిమ్మలయశోవ్యాసజనకపితామహామహోన్నతమౌనిమతముచేత
వరలుసమస్తవైవాహికతంత్రంబునడపింపనుచితమన్నసుమనంబు
గడుఁబ్రసన్నతవహింపఁగడయెఱుంగ। రానిహర్షామృతరసాంబురాశిలోనఁ
దేలియాడుచునమ్మహాధీసమేతుఁ। డాక్రియాచరణమునకుపక్రమించె. 43

ఉ. స్నాతకమాచరించిబుధసంతతికిన్మణిహేమరౌప్యశా
టీతరుణీతురంగమపటీరసుఖాసనతల్పభూషణ
క్ష్మాతలముఖ్యదానములుసమ్మతిఁజేసిచెలంగురూపవి
ఖ్యాతునిరాజశేఖరుయథార్హముఁగాఁబిలిపించియంతటన్. 44

మ. అనఘాశీర్వచనప్రియావదనసూయారుంధతీముఖ్యస
న్మనికాంతాకరహేమకుంభగళితాంభోమంగళస్నానపూ
ర్వనవీనాంబరగంధమాల్యమణిభూషాంగినన్మహీభృత్తనూ
జనురప్పించెనిజాప్తబాంధవగురుత్వాన్మదేవయుక్తంబుగన్. 45

సీ. ఆదంపతులనతులోదగ్రమణివిభారమణీయరత్నపీఠములనునిచి
పుణ్యాహవాచనపూర్వకంబుగనువైవాహికతంత్రంబువరుసనడిపి
గురుదర్పదైతేయపురఖండనాచలకోదండభరణైకకుశలమైన
రాజశేఖరుకరాంభోజంబునందుమదాత్మసంభవనీకునర్పణంబు
సేసితినటంచుమంత్రవిశేషరచన। కలితముగధారవోయించెవిలసితప్ర
కాశయుతుఁడైనయద్ధరాధీశుచేతఁ। గమలజనిభాస్వరుఁడుమానిఘనులుపొగడ. 46

ఉ. కన్యకయుంగుమారుఁడుప్రకాశితరాగభరాగతత్రపా
జన్యగతాగతక్రియలసంగతిఁగాంచుకటాక్షలీలన
న్యోన్యముఖాంబుజంబులుగనుంగొనఁబూర్వపరాజితోగ్రహృ
జ్జన్యుడుబాణవర్షమతిసాంద్రతరంబయిమీపైనయ్యెడన్. 47

సీ. భవ్యనీరాజనపాత్రసంగతలైనసతులుదంచితతటిల్లతలుగాఁగ
లలనామనోజ్ఞమంగళగీతనాదముల్బర్హికేకారవార్భటులుగాఁగ
సూతమాగధజనస్తుతిఘుమంఘుమలునుద్ధతవారిధరగర్జితములుగాఁగ
స్వర్గాంగనల్వేదజల్లుపువ్వులజల్లుసముదితాసారవర్షంబుగాఁగ

వర్ణనము సేయఁదగునవ్వివాహవేళ । నప్పుడపగతదుర్దినంబై నయట్టి
ఘనఘనాగమసమయంబు ననుకరించెఁ । జూపఱకు ననుబ్రమోదవిస్ఫూర్తి యొదవ. 48

సీ. అంతటసకలరాజాశ్చర్యసాధువృత్తిజనకాభిఖ్యుఁడై తేజరిల్లు
నద్ధరాధీశ్వరుండగ్రకన్యావివాహసమూహనోల్లాసియచలధర్మ
సామగ్ర్యజయశోభి రామానుభవులసద్రాజశేఖరతవిరాజమాను
లై హీననిజరూపులపిత్రువాచావశవిస్ఫూర్జితౌదార్యవృత్తిమతుల
ననుగణింపఁగరానియానందమయమహః । వారిరాశిఁదేవిభూరినజ్జ
నానువ్రతము చేత నాత్మానుభూతన । యూర్ధ్వయోగమహిమనలరఁజేసి. 49

సీ. అనురూపపతియోగమునమీఱునకన్యలనమానగుణలక్ష్మి నెనఁగుచుండఁ
గనుఁగొనిశుద్ధాంతకాంతానికాయంబుపౌరవృద్ధాంగనావారములును
నీరాజనములిచ్చినిరతిశయైశ్వర్యసౌభాగ్యములనుబుత్రాభివృద్ధి
యకలుషప్రాణనాయకవల్లభత్వంబునవిహితంబైనయైదువతనంబు
గలుగదీవించిశుభకరాక్షతములిడిరి । మౌళిభాగంబునందు సీమంతమధ్య
రచితమౌక్తికరాజివిరాజమాన । కాంతిసంతానపునరుక్తికరము గాఁగ. 50

క. నూత్నశుభాన్వితదంపతి । రత్నములకుసకలదేశరాజవరేణ్యుల్
రత్నములు కానుకలొసఁగిరి । యత్నముననుతించిరతనియద్భుతచరితల్. 51

వ. అంత నద్ధరాధీశుఁడు పౌరజానపద వైదికాశ్రిత విద్వద్బాంధవ మిత్ర వర్గంబుల నిష్టాన్న పాన సువర్ణ మణిభూషణ గ్రామ భూమీ తురంగ మాతంగ శతాంగ ప్రముఖ దానంబులం దృప్తులంజేసి తదను మతంబునఁ గన్యా సమేతంబుగ వర ప్రేషణంబున కంగీకరించి యమూల్య రత్నభూషణ దాసదాసీ పట్టాంబర గంధ మాల్యాదికంబులైన యరణంబు లిచ్చి పంచమహావాద్య శబ్దంబులు సూత మాగధ స్తోత్రంబులు భూసురాశీర్వాద ఘోషంబులు దివ్యస్త్రీయాత సకల జన కలకలంబులు జననముత్సారణ కరవేత్రహస్త హుంకారంబులు నేకశబ్దంబై భూనభోంతరంబుల నిండం దాను ననుచరుండై వారల ననుపుచుం గొంతదూరమరిగి మఱల నిగాఢహర్షంబున వారునుజను నవసరంబున. 52

సీ. అర్జునవిగ్రహోద్యజ్జయకరకాండదానప్రసిద్ధవిద్యాప్రభావు
రాజవాహిన్యుద్ధరణశాలివైరినికాయభేదనకృత్యఖండపరశు
నరవరకంఠఖండనశౌండభుజదండకంచుకీజ్యాయుక్తకార్ముకధరు
గురుధనుర్భంగకృద్వరకుటిలభ్రూప్రియావృదీక్షణజతేజోవిరాము
నటఁగనుంగొనియచలేశుఁడాదిరామ । జనకుఁడత్యద్భుతాబ్ధిమజ్జన్నిజాంత

రంగసంఛన్నహర్షప్రసంగదరని । మీలితాక్షివికాసుఁడై మెలఁగుచుండె. 53

వ. అంత సద్ధరామరేంద్రుండు కాండరుఁడీక్షణంబుల నతనిం జూచి మహిత తేజస్స్వత
జగదాదితనూభవున కిట్లనియె. 54

గీ. వినతిఁ జేసెదనీకసద్విమలచరిత । గంధసంయుక్తచిత్తమదాంధకారి
ధరణిరథహారికాండమద్గురుశరాస । నహతిఁ జేసితిదానవనవ్యలక్ష్మిన్. 55

గీ. రామనినుఁ బూర్చి గోత్రప్రధామహత్వ । ధామజయశోభిరాముండు దలఁపనేను
గోర్కె నచ్యుతధర్మమెక్కుడుగఁ జేయు । నామనంబున సమ్మోదమామతింప. 56

గీ. అనఁడు నారాజమౌళిమిన్నండు నతని । శార్ఙ్గధర్మంబుఁ జూచి హస్తములనంది
కొంచుఁడై నిమురుచు వివేకించి పొగడు । కొనుచు సద్ధర్మమారూఢగుణినిఁ జేసి. 57

ఉ. నన్నకసన్నతోఁదనదుశత్రుపదంబులు గూలనేయఁగాఁ
జెన్నగు కాండమౌననుచు శీఘ్రగుణంబునఁ బూనికూర్చెదే
మన్ననవిప్రవర్యుఁడనువంతప నేలచనంగనిమ్మన
న్నన్నయవీక్షఁ జూచియతనుప్రభునుం డెదబంధుకోటిలోన్. 58

గీ. అనిననీబుద్ధియట్లైననస్మదీయ । విశిఖమార్గంబు చూడ నావిశ్రుతదయ
పుణ్యలోకనిరోధకృద్గణ్యశృంగ । కలితశరదభ్రగతిరూఢిఁ గాంతు భువిని. 59

గీ. అనుచు ననిపించుకొనిపో మొవినుతకీర్తి । యనుచు ఘనధైర్యమహిమ హిమాచలుండు
భూమినిర్జరపతికళాపూర్ణరీతి । సాంద్రలజ్జజనింప మహేంద్రగిరికి. 60

చ. అతులితకౌతుకంబమరనప్పుడు చూచునమస్తదేవతా
వితతివిచిత్రభంగిగనవిప్రవరుండటు చన్నమీఁదటం
గృతులనుతించుచుండఁ గృతకృత్యతఁ గాంచిన రాజశేఖరుం
డతికుతుకంబుచేఁ జనియె నాత్మసమున్నతరాజధానికిన్. 61

సీ. చంద్రశాలోపరిచరవధూజనకోటితళుకుచుగలాజాక్షతములు చల్ల
వృద్ధపుణ్యాంగనావివరంబులెడనెడ రమణీయనీరాజనములొసంగ
విబుధగాయకపంక్తి వివిధప్రకారమంగళగీతమాధురీక్రమముఁ జూప
నఖిలమహర్షులనతివేలహర్షులై జయజయధ్వనులచే నందడింప
రాజముఖ్యులుఁ గొలువ నారాజమౌళి । ఖ్యాతిమీఱ నవోఢాసమేతుఁడగుచు
సకలలోకమహాశ్చర్యజనకమైన । విభవముగ నాత్మపురముఁ బ్రవేశమయ్యె. 62

సీ. కొమరొప్ప నప్పెండ్లికూతులసితరుచిభాసురాస్యకలఁ దత్పౌరవృద్ధ
పుణ్యాంగనాకోటిభూరిమంగళగీతనినదముల్దిశలఘూర్ణిల్లుచుండ
రాజతాచలరాజరాజితప్రాసాదరమణీయసౌవర్ణరత్నరచిత

విమలశుద్ధాంతప్రవేశంబు సేయించిసప్తమహర్షులుచతురరీతి
మహితనిగమోదితస్వస్తిమంత్రఘోష । కలననాశీర్వదింపనుత్కలికతోడ
వారలయథార్హవృత్తిచే గారవించె । నన్యతరుఁడైన రాజావతంసుఁడపుడు. 63

సీ. అభ్రంకషాదభ్రశుభ్రముక్తాసుధాచంద్రశాలోపరిస్థలములందు
భవ్యమందారకల్పద్రుమోరుహావళీవికసితోద్యానవాటికలయందు
నవరత్నకాంచనచ్ఛవిసమాచ్ఛాదితప్రాంతశుద్ధాంతగేహములయందు
జలదౌఘకాయమానవితానమహనీయశశికాంతవేదికాస్థలులయందు
సంతతంబుధరాత్మజాసహితుఁడగుచు । మహితతేజోవిరామసమాఖ్యుఁడైన
రాజమౌళిత్రిలోకైకరక్షణకరుఁ । డలఘుసౌఖ్యానుభవము చేనలరుచుండె. 64

మ. హరిగోవిందముకుందనందసుతనిత్యానందలక్ష్మీశ్రయుతా
నరపంచాస్యనగారిపూజితధరానారీవరావల్లభా
కరుణాపూరితలోచనాంచలజగత్కల్యాణసంధాయకా
కరిసంరక్షణచాతురీసముదయత్కారుణ్యలీలాన్వితా. 65

క. కందర్పకోటిసుందర ; మందేతరమౌనిహృదయమధ్యనివాసా
వందారువాంఛితప్రద। మందారతరూపమానమహితపదాబ్జా. 66

స్రగ్విణి. భోగిపర్యంకసాభోగభోగాన్వితా
యోగిహృత్కంజసంయోగిపాదాంబుజా
వాగమేయప్రభావాగమాంతస్తుతా
యాగభుక్సేవ్యమాయాగరిష్ఠక్రియా. 67

గద్య.—ఇది శ్రీమద్భవానీశ్వరశాశ్వత కృపాపాత్ర సహజపాండిత్య
మృత్యుంజయనామధేయ ప్రణీతంబైన ధరాత్మజా పరిణయంబను
మహాప్రబంధంబునందుఁ సర్వంబును
చతుర్థాశ్వాసము.

COCANADA:—PRINTED AT THE SUJANARANJANI PRESS, 1897.

| పుటసంఖ్య | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| | 17 | కొన్నిఁటి | కొన్నిటి |
| | 19 | దలచి | దలఁచి |
| | 24 | ధర్మ | దర్మ |
| | 30 | ధార్తుడగు | ధార్తుఁడగు |
| 20 | 22 | ముఖులు | ముఖుల |
| 21 | 9 | సహించియుండుడీ | సహియించియుండుఁడీ |
| | 15 | గలక | గలఁక |
| | 16 | దాఁకగా | దాకఁగా |
| 31 | 19 | చుండ | చుండు |
| | 23 | దేతుహి | నేతుహి |
| 22 | 6 | మీద | మీఁద |
| | 8 | చేతవరలు | చేతవఱలు |
| | 16 | దీర్నమ | దీర్ణమ |
| | 28 | దముగన్ | దమునన్ |
| 24 | 8 | రాజితో | రాజియ |
| | 26 | కెడుపక | కెడుఁబిక |
| 25 | 13 | నలరుచుండ | మలయుచుండ |
| | 23 | దనునిఁజా | దనునిజూ |
| 26 | 5 | మీద | మీఁద |
| | 11 | ఘునిఁజూ | ఘునిజూ |
| | 20 | మహన | మహనీ |
| 27 | 15 | త్రైక | తై్త్యక |
| | 29 | పఱగ | పరగ |
| 28 | 14 | నాడు | నాఁడు |
| | 19 | ధపుఁ సేవసమ్మదమునఁ జేయని | ధపుని సేవసమ్ముదమునఁ జేయ |
| | 24 | నయిూదే | నయాూదే |
| 30 | 19 | సూచిక | సూచక |
| 38 | 9 | రాస్వాలోలుదపం | రాస్వాదలోలుపం |
| 43 | 7 | దేవి | దేలి |
| 44 | 7 | అనుఁడు | అనుడు |
| | | శార్ఙ | శార్ఙ్గ |
| 45 | 3 | నన్య | ధన్య |

| పుటసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 6 | మొప్పఁగమీఱు | మొప్పఁగమీరు |
| | 18 | నిలుచుగాత | నిలుచుఁగాత |
| 2 | 14 | భార్యాదలఁతు | భార్యఁదలఁతు |
| | 16 | మోడ్పు గేలు | మోడ్పుఁగేలు |
| | 24 | కూర్చి | కూర్తు |
| 4 | 17 | కవీంద్రులకునెల్ల | కవీంద్రులకునెందు |
| 6 | 9 | రాక్షసులఁగీటడఁగించి | రాక్షసులగీటడఁగించి |
| | 17 | నిఘాన | నిధాన |
| | 20 | గమగొనిచిత్త | గమఁగొనిచిత్త |
| | 30 | విభదాఢ్యులై | విభవాఢ్యులై |
| 7 | 16 | మిత్రుఁగేరు | మిత్రుగేరు |
| | 18 | ఐక్కఁద | చక్కఁద |
| | 21 | రాతియేకన్న | రాతియోకన్న |
| | 23 | దివ్యదాత్రి | దివ్యధాత్రి |
| | 25 | గుణాలఁ | గుణములఁ |
| 8 | 1 | దనమానగుణాఢ్యుఁడైన | దనమానగుణాఢ్యమైన |
| | 2 | మార్గమునసీతి | మార్గమునఁసీతి |
| | 14 | మిళిందములుగా | మిళిందంబుగా |
| | 23 | యన్యాయతరుల | యన్యాయరతుల |
| | 29 | వనజాక్షుఁచ | వనజాక్షుచ |
| 10 | 15 | ద్వయదు | ద్వయము |
| | 19 | రక్షణదు | రక్షణము |
| | 26 | గాంచు | గాంచె |
| | 30 | గాడు | గాఁడు |
| 14 | 8 | లాలన | లాలన |
| | 18 | వరఁణి | వరణిఁ |
| | 19 | వ్యాగాక్షి | వ్యాగాక్షి |
| | 23 | రాజమాళి | రాజనాళి |
| 15 | 20 | వశిష్ట | వశిష్ఠ |
| 16 | 16 | న్యాగ్నిమఖము | న్యాగ్నిముఖము |
| | 24 | క్రియావంత | క్రియావంత |
| 18 | 1 | లోవచము | లోచ్ఛవము |
| | 8 | టుల । శ్లోకా | టులఁ । శ్లోకా |
| | 66 | దుజేసిన | దుచేసిన |

THE

# *SUJANARANJANI SERIES.*

## TELUGU.

| | | Rs. | A. | P. |
|---|---|---|---|---|
| No. 1 | Rájasékhara Vilásamu ... ... | 0 | 8 | 0 |
| 2 | Dharáthmajá Parinayamu, (*Calico*) ... | 0 | 8 | 6 |
| 3 | Lakshaná Parinayamu, (will be ready in March). | | | |
| 4 | Thapathisamvaranopakhyanamu } In the Press. | | | |
| 5 | Revised edition of Appakavíyam } In the Press. | | | |

## ప్రకటన.

సుజనరంజనీ కార్యస్థానమునందు వెలకుదొరకు నాటకములు.

బళ్లారి రెండవ తరగతి ప్లీడరు మ|రా|రా| శ్రీ| కోలాచలం శ్రీనివాసరాయ విరచితములు.

| | | | |
|---|---|---|---|
| దురాశాభంగము లేక సునందనీ పరిణయము ... ... | 0 | 13 | 0 |
| సుఖమంజరీ పరిణయము ... ... ... | 0 | 7 | 0 |
| మదాలసా నాటకము ... ... ... | 0 | 9 | 0 |

వలయువారలు గోదావరిజిల్లా కాకినాడ, సుజనరంజనీ ముద్రాక్షరశాల మేనేజరుగారికి వ్రాసి తెప్పించుకోవచ్చును.